# ఆంధ్రప్రదేశ్

సంపుటి: 11 ]　　జనవరి 1967　　[ సంచిక : 3

పౌష_మాఘ 1888 శా. శ.

ప్రధాన సంపాదకులు
బి. ఆర్. కె. శాస్త్రి, ఎం.ఎ., ఐ.ఎ.ఎస్.

సంపాదకులు :
కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

పాఠకులకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తరఫున నూతన సంవత్సర శుభాకాంక్షలు

ముఖ చిత్రం : వస్త్రాలంకృత
ప్రాచీన వస్త్ర పరిశ్రమ, భారతీయ చేతిపనుల వస్తు ప్రదర్శన, హైదరాబాదువారి సౌజన్యంతో ...
ఫోటో : ఎస్.ఆర్.కె. రావు

రెండవ చిత్రం : శివాజీ గోపురం, శ్రీశైలం
ఫోటో : టి. రామచంద్రరావు

మూడవ చిత్రం : "కూరగాయల అధికోత్పత్తి నేటి అవసరం"
ఫోటో : సయీదుద్దీన్

నాలుగవ చిత్రం : కనకదుర్గ దేవాలయం
ఫోటో : పి. శివరామరాజు

* ఈ సంచికలోని రచయితల అభిప్రాయాలు ప్రభుత్వానికి సంబంధించినవి కావు.

## గమనిక

'అడవిమల్లె' సీరియల్ చివర పొరపాటున 'సమాప్తం' అని అచ్చుపడినది. పాఠకులు దయచేసి 'సశేషం' అని తెలుసుకోగలరు.

## ఈ సంచికలో

# ఆలోకనము - ఆకాంక్ష



పందొమ్మిది వందల అరవై ఆరుకు భరతవాక్యం పలికి కొత్త సంవత్సరంలోకి అడుగుపెట్టాం. ఒకసారి వెనుదిరిగి దృష్టి సారించిచూస్తే మరుపు తెరల్లోకి దిగిపోయిన సంఘటనలెన్నో మన మనో వీధిలోవచ్చి నిలుస్తాయి. తాష్కెంట్ ఒప్పందపు ఉత్సాహభరితవేళాలతో 1966 వ సంవత్సరం రేకులు విప్పుకుంది. అయితే ఆ వెంటనే అశనిపాతంలాంటి సంఘటన జరిగింది. పాకిస్తాను దురాక్రమణ సమయంలో భారతదేశపు అజేయ శక్తి సామర్థ్యాలకు ప్రతీకగా నిలచిన తాష్కెంట్ సారథి శ్రీలాల్ బహదూర్ శాస్త్రి మాతృభూమికి దూరంగా మరొక గడ్డమీద కన్నుమూశారు. అప్పుడు, నెహ్రూజీ అడుగుజాడల్లో నడిచిన కారణ జన్మురాలనదగిన శ్రీమతి ఇందిరాగాంధీని దేశం యావత్తూ లాల్ బహదూర్ జీకి వారసురాలిగా నియమించింది. ఆమె హస్తాల్లో దేశం సురక్షితంగా మనగలుగుతున్నది.

దేశమంతటా కరువు పరిస్థితులు నెలకొనడంతో ఆహార సమస్య తారస్థాయిని చేరుకుంది. ఇంచుమించు దేశమంతటా సువిశాల భూముల్లో పంటలు దెబ్బతిన్నాయి. ఏతత్ఫలితంగా ఆహార సమస్యపై ఆందోళనలూ, తదితర చర్యలూ తలెత్తాయి. ఆహారధాన్యాల ఉత్పత్తులు మందగించిన కారణంచేత అందరికీ ఆహారధాన్యాలు అందేటట్టు చేయడానికై రేషనింగును ప్రవేశ పెట్టడం తప్ప మరో గత్యంతరం లేకపోయింది. వాస్తవ పరిస్థితులను గుర్తించిన ప్రజలు బలవంతంలేకుండానే యిందుకు సంసిద్ధులయ్యారు.

కష్టాలే సుఖానికి సోపానాలు. ఆహార రంగంలో మనం ఎదుర్కొన్న క్లిష్ట పరిస్థితులవల్లనే యీ పరిస్థితియొక్క ఉగ్ర స్వరూపాన్ని మనం అవగాహన చేసుకోగలిగాం. మన ప్రజలకు తగినంత ఆహారాన్ని ఉత్పత్తిచేయాలనీ, లేకపోతే యీ కరువు రక్కసి మనల్నే కబళించి వేయగలదని కూడా గుర్తించాం. అందువల్ల 'ఒక కొత్త ఆహార విధానాన్ని' రూపొందించు కున్నాం. స్థూలంగా చెప్పాలంటే దేశమంతటాగల తీరైన పంట ప్రాంతాలమీద మన కృషినంతా కేంద్రీకరించాలని సంకల్పించాం. ఈ ప్రాంతాలలోని రైతులకు మేలు రకం విత్తనాలను, సమయానికి తగినంత ఎరువులను, క్రిమి సంహారక మందులను, సాంకేతిక సలహాలను, తదితర వ్యావసాయక సౌకర్యాలను అందించాం. దేశమంతటా యీ కొత్త విధానాన్ని, అమలుపరిచాం. దీనివల్ల 1966-67 లో భారతదేశం సుమారు 970 లక్షల టన్నుల ఆహారధాన్యాలను ఉత్పత్తి చేయగలదని అంచనా వేశారు. అందువల్ల రానున్న దినాలు ఆశాజనకంగా ఉండవచ్చు. ఆశారుణకిరణాలతో భవిష్యత్తు వికసిస్తుంది.

జనాభా పెరుగుదల సమస్య ఆహార సమస్యను మించిపోయింది. ప్రణాళికాబద్ధంగా మనం చేస్తున్న కృషియావత్తూ, మనం సాధిస్తున్న ఆర్థికప్రగతి యావత్తూ జనాభా పెరుగుదల సమస్యవల్ల నిష్ప్రయోజనం అవుతున్నది. ఈ సందర్భంలో ఒక విషయం ప్రస్తావించ దలచాను. ఇది నేడు పదేపదే ప్రస్తావించ బడుతున్నప్పటికీ, మీయందరికీ సుపరిచితమైన దైనప్పటికీ యీ సమస్య తీవ్రతదృష్ట్యా మరొకసారి చెప్పడం అవసరం. కుటుంబ నియంత్రణ అనేది ప్రభుత్వం బలవంతంగా ప్రజలమీద రుద్దుతున్న కార్యక్రమంగా భావించకూడదు. తల్లిదండ్రులు తమ సుఖాన్నీ, బిడ్డల భవిష్యత్తును దృష్టిలో వుంచుకొని యిదొక అత్యంతావశ్యకమైన జీవనసరళి అనే విషయాన్ని స్వచ్ఛందంగా అంగీకరించాలి. ఈ వ్యక్తిగత దృక్కోణం నుండి యీ సమస్యను పరికించి, మీకు సమీపంలో వున్న కుటుంబ నియంత్రణ క్లినిక్కులు అందించే వివిధ చికిత్సా సహాయాల నుండి ప్రయోజనం పొంది, మీ కుటుంబాన్ని పరిమితం చేసుకోమని మీ అందరికీ విజ్ఞప్తి చేస్తున్నాను.

ఆర్థికరంగాన్ని గూర్చి కొంత పరిశీలిద్దాం. ఎగుమతులను ప్రోత్సహించే ఉద్దేశంతో భారత ప్రభుత్వం రూపాయి విలువను తగ్గించింది. ఈ చర్యపై రకరకాల వ్యాఖ్యలు వినవస్తున్నప్పటికీ ఒక విషయం మాత్రం మనం విస్మరించకూడదు. దేశప్రజల శ్రేయస్సుకై మనం ఎంతటి కష్టసాధ్యమైన పనినైనా చేపట్టాలని నిశ్చయించుకున్నామన్న సత్యాన్ని మనం మరచిపోగూడదు.

ఇక ఆంధ్రప్రదేశ్ విషయం పరిశీలిద్దాం. రాష్ట్ర ఆర్థిక స్వరూపాన్ని—ముఖ్యంగా విద్యుచ్ఛక్తి, నీటిపారుదల, రవాణా వార్తా సౌకర్యాల రంగాల్లో—పటుతరం చేయడానికి తీవ్రంగా కృషిచేస్తున్నాం. ఇటీవలే కొత్తగూడెం థర్మల్ విద్యుత్కేంద్రానికి ప్రారంభోత్సవం జరగడంతో రాష్ట్ర విద్యుదభివృద్ధికృషిలో ఒక కొత్త శకం ఆరంభమైందని చెప్పవచ్చు. నాగార్జునసాగర్ జలాలు, తుంగభద్రఎగువ కాలువ జలాలు విడుదల కావడంతో అభివృద్ధి పథంలో సాగిస్తున్న మన యాత్ర సంతృప్తికరంగా అగుపించింది. 1966 లోనే నాగార్జునసాగర్ ఆనకట్టనిర్మాణం తొలిదశ పూర్తి కావడం—నిజంగా యిది మన రాష్ట్ర చరిత్రలోనే ఒక అపూర్వ ఘట్టం. దక్షిణ కేంద్ర రైల్వే మండలం కొత్తగా ఆవిర్భవించడంతో ముందు ముందు యీ ప్రాంతంలోని రాకపోకల రద్దీని, సరకుల రవాణాలలో ప్రతిష్టంభనను తొలగించడమే గాకుండ మనదైన ఒక మండలం వున్నదన్న మానసిక సంతృప్తి కూడా మనలో కలిగించడానికి కారణమౌతుంది.

ఆహార కొరతను తీర్చడానికై మన రాష్ట్రంలోని రైతులు విశేషించి కృషిచేసి ఒక ధాన్యపుగింజ పండేచోట రెండు ధాన్యపు గింజల్ని పండించడానికి ప్రయత్నిస్తున్నారు. ఇటీవల జరుపుతున్న తీవ్రతర పరిశోధనలవల్ల వరి, జొన్న, కాయధాన్యాలలో ఎక్కువ దిగుబడి రకాలను రూపొందించి ఆంధ్ర ప్రదేశ్‌లో వ్యాప్తిలోకి తీసుకురావడం జరుగుతున్నది. అధిక దిగుబడి వంగడాల క్రిందకు మరింతగా పంటభూమిని తీసుకరావాలని ఒక ఏడాదికన్న మరొక ఏడాది అధికంగా లక్ష్యాలను ఏర్పాటు చేసుకుంటూ వస్తున్నాం. ఉదాహరణకు తృతీయ ప్రణాళికాంతానికి వరిపంట క్రిందగల భూమిలో 95 శాతం మేలురకం వరివంగడాల క్రిందకు తీసుకురావడం జరిగింది. చతుర్థ ప్రణాళికలో నూరుశాతం పంటభూమిని మేలుజాతి వరివంగడాల క్రిందకు తీసుకురావాలన్నది మనలక్ష్యం. ఈ విధమైన మన తీవ్రతర కృషి ఫలితంగా ఆంధ్ర ప్రదేశ్‌లో 10 లక్షల టన్నుల ఆహారధాన్యాలు ఎక్కువ పండుతాయని ఆశించవచ్చు.

గత ఏడాది ఉక్కు కర్మాగార సమస్య, ప్రధాన సమస్యగా మనముందు నిలచింది. దురదృష్టవశాత్తూ యీ సమస్య, దౌర్జన్యం, అల్లర్లు, అనిశ్చిత అభిప్రాయాలతో రూపుదిద్దుకున్నది. గత జూలైలో ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర విధానసభ ఒక తీర్మానంద్వారా రాష్ట్రంలో ఉక్కు కర్మాగారాన్ని ఏర్పాటు చేయవలసిన అవసరాన్ని కేంద్ర ప్రభుత్వ దృష్టికి తీసుకవచ్చింది "ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వమూ, ప్రజలుకూడా తొలిమూడు ప్రణాళికల్లో కేంద్రరంగం ప్రాజెక్టులక్రింద పెద్ద మొత్తాన్ని ఈ రాష్ట్రంలో పెట్టుబడి పెట్టాలని అనేకసార్లు భారత ప్రభుత్వం దృష్టికి తీసుకవచ్చారు. ఆంధ్ర ప్రదేశ్‌లో కేంద్రం పెడుతున్న పెట్టుబడి కేవలం 2 శాతం మాత్రమే. చతుర్థ ప్రణాళికలో విశాఖపట్టణంలో అయిదవ ఉక్కు కర్మాగారాన్ని నెలకొల్పడం వల్ల యీ అసమానత కొంతవరకు తొలగిపోగలదు. ఈ మాదిరి ఉక్కు కర్మాగారానికి అవసరమైన యింత పెద్ద మొత్తం పెట్టుబడిని రాష్ట్రంలో చతుర్థ ప్రణాళికలో కేంద్ర ప్రభుత్వం పెట్టడంఅవసరం. లేకపోతే జాతీయ ఆదాయానికి, రాష్ట్ర ఆదాయానికి మధ్యగల అసమానత మరింత ఎక్కువ కాగలదు." శాసన సభ్యుల పలుకుల్లో ప్రజాభిప్రాయం ప్రతిబింబిస్తుంది. అందుచేత మన ప్రణాళికా వేత్తలు తాము చెబుతున్న ప్రాంతీయ అసమానతా నిర్మూలన పలుకుల్లో చిత్తశుద్ధి ఉన్నట్టయితే మన రాష్ట్రానికి రావలసిన ఉక్కు కర్మాగారం త్వరలోనే రాగలదని నేను విశ్వశిస్తున్నాను.

మన భవిష్యత్తును సుందరంగా మలచుకోవడానికి అనేక అవకాశాలుగల మార్గాలతో కొత్త సంవత్సరం ప్రారంభమైంది. ఈ అవకాశాలను పూర్తిగా మనకు ప్రయోజనకరంగా మలచుకోవడానికి మనమంతా—మనలో ప్రతి—ఒక్కరూకృషిచేసి అదృష్టపు అంచులను చేరుకోవడానికి కలిసి కట్టుగా కదులుదాం.

జైహింద్.

[signature]

ముఖ్యమంత్రి.



# పరిమిత కుటుంబం

బి. వి. గురుమూర్తి



భారతదేశపు ఆర్థిక వ్యవస్థాస్వరూపం యొక్క అభివృద్ధికి ప్రతిబంధకంగా నిలచినవి బాహ్యశక్తులు ఏవీకావు. దేశంలోని చంటిపాపలే అంటే మనం ఆశ్చర్యపోనక్కరలేదు. ఈనాడు మన దేశంలో ఏటా జననాలరేటు సుమారుగా 1000 కి 40 వుంటున్నది. దీనికితోడు మరణాలసంఖ్య తగ్గింది. వైద్య, ఆరోగ్య సౌకర్యాలు విస్తరించాయి. వీటన్నిటిదృష్ట్యా జనాభాసమస్య హిమాలయాల్లాగ పెరిగిపోతున్నది. దీనికి సత్వరమే పరిష్కార మార్గాన్ని ఆలోచించ వలసిన అవసరం యీ తరంవారిమీదున్నది. ఈ దృష్ట్యానే మనం తొలిప్రణాళిక నుంచికూడా కుటుంబనియంత్రణ కార్యక్రమాన్ని జాతీయవిధానంగా మలచుకున్నాం.

కుటుంబనియంత్రణ భారతదేశానికి కొత్తేమీకాదు. డా. ఆర్. డి. కార్వే, శ్రీ పి. వి. వట్టల్ వంటి ఈరంగంలోని ప్రసిద్ధులు కుటుంబ నియంత్రణను గూర్చి 1916–1936 మధ్యకాలంలోనే విస్తృత ప్రచారంచేశారు. ఈ శతాబ్దపు తృతీయ దశాబ్దంలో భారతీయమేధావులు, సంఘసంస్కర్తలు కుటుంబనియంత్రణను గూర్చి, జనాభా పెరుగుదలను అరికట్టడాన్ని గూర్చి తీవ్రంగా చర్చించారు. అయితే దీనిని ఆచరణలోకి మాత్రం తీసుకురాలేదు. 1935లో భారతజాతీయ కాంగ్రెసు శ్రీ జవహర్లాల్ నెహూ్రు అధ్యక్షతన ఏర్పాటుచేసిన జాతీయప్రణాళికా సంఘం, కుటుంబ నియంత్రణను జాతీయవిధానంగా గట్టిగా సమర్థించింది. ఆనాటి నుండి భారతదేశంలో మధ్యతరగతి పైవర్గం వారిలో యీ కుటుంబనియంత్రణ వేళ్ళూనుకోవడం ప్రారంభించిందిగాని అత్యంతప్రధానమైన, అధిక సంఖ్యాకులుగల గ్రామీణ ప్రజానీకాన్నిమాత్రం అదితాకలేకపోయింది. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ప్రణాళికాబద్ధమైన అభివృద్ధికి అంకురార్పణ జరిగినప్పుడు మనదేశంలోని పరిమితవనరుల దృష్ట్యా జనాభా పెరుగుదలను అరికట్టవలసిన ఆవశ్యకత గట్టిగా తెలియవచ్చింది.

## ప్రణాళికలలో పెట్టుబడులు

తొలిప్రణాళికలో జనాభాపెరుగుదలను అరికట్టడానికిగాను రూ. 15 లక్షల కేటాయింపుతో పని ప్రారంభించారు. ద్వితీయ ప్రణాళికలో యీ మొత్తాన్ని రూ 220 లక్షలకు పెంచడం జరిగింది. ఆ తరువాత యీ కార్యక్రమాన్ని మరింతగా విస్తృత పరిచారు. తృతీయ ప్రణాళికలో ఎక్కువగా కుటుంబనియంత్రణ క్లినిక్కులను దేశమంతటా ఏర్పాటు చేశారు. ఈసారి కుటుంబ నియంత్రణకై వెచ్చించిన డబ్బుమొత్తం రూ. 25 కోట్లు. చతుర్థ ప్రణాళికలో యిందునిమిత్తం రూ. 95 కోట్లుకేటాయించారు. అయితే మనకృషిలో ఏమాత్రం మందగమనానికి తావులేకుండా చేయడానికై మరికొంత నిధులనుకూడా కేటాయించడం జరుగవచ్చు. అందుచేత ఈకార్యక్రమాన్ని అమలు పరచడానికి తగినంత మొత్తంలో నిధులు సమకూర్చబడ్డాయనే అనుకోవచ్చు. ఇకమనకు కావలసిందల్లా–మనకృషిమాత్రమే.

మనదేశజనాభావైపు ఒకసారి మనం దృష్టిసారిస్తే యీ జనాభాసమస్య ఎంత తీవ్రంగా, ఎంతఎక్కువగా వున్నదో అర్థమవుతుంది. 1901 లో మనదేశజనాభా 23.60 కోట్లు వుండేది. అది 1961 కి 43.90 కోట్లు అయ్యింది. ఈనాడు మనదేశజనాభా దగ్గర దగ్గర 49 కోట్లు కావచ్చని అంచనా. 1961 లో 43.90 కోట్లు వున్నజనాభా 2011 సంవత్సరానికి 127.50 కోట్లకు చేరుతుందని పరిశీలకులు అంచనావేస్తున్నారు. అంటే కేవలం ఒక అర్ధశతాబ్దంలో భారతదేశపు జనాభా మూడురెట్లు అవుతుందన్న మాట.

మనరాష్ట్రజనాభా సమస్యను తీసుకున్నాయిదికూడా యింత తీవ్రంగానూ వుంది. 1951 లో మన రాష్ట్ర జనాభా 3.11 కోట్లు వుండేది. 1961 లో అది 3.59 కోట్లకు పెరిగింది. 1971 నాటికి ఆ సంఖ్య 4.24 కోట్లకు పెరుగుతుందని అంచనా.

## తక్కువ ఆహార సరఫరా

హిమగిరిలా పెరిగిపోతున్న భారతదేశపు జనాభాతోపాటు దేశంలో ఆహారధాన్యాల ఉత్పత్తి పెరగడంలేదు. రానున్న యాభై యేళ్ళలోనూ జనాభా 2.90 రెట్లు అధికంకాగా ప్రస్తుత వనరుల ను బట్టి ఆహారసరఫరాను 2.74 రెట్లు మాత్రమే పెంచడానికి అవకాశంవుంది. అదిన్నీ వ్యవసాయోత్పత్తిని మందగమనంలో నడిపించకుంటేనే సాధ్యమవుతుంది. కాని గతంలోని మన అను

భవాల దృష్ట్యా మన ఆహారోత్పత్తిని గూర్చి ధైర్యంగా, ఖచ్చితంగా మనం ఏమీ చెప్పలేము. పైగా జనాభా పెరగడమేగాకుండా 1961 నాటికన్న ముందు ముందు ఎక్కువసంఖ్యలో పెద్దవయసువారు ఉండడానికి అవకాశంవుంది. వీరికి పిల్లలకన్న ఆహారం ఎక్కువగా కావలసివుంటుంది. అందువల్ల ఆహార సరఫరాకు, అవసరానికి మధ్యగల అగాధం మరింత ఎక్కువ అవుతుంది.

ఆహార ధాన్యాల ఉత్పత్తిలో స్వయం సమృద్ధిని సాధించుకునే విషయాన్నికూడా ఆలోచిద్దాం. ఈనాడు భారతదేశం ఏటా 800లక్షల టన్నుల ఆహారధాన్యాలను ఉత్పత్తి చేస్తున్నది. రానున్న 25–30 ఏళ్ళలో గట్టిగా కృషిచేస్తే—అధికారుల అంచనాల ప్రకారం—ఏటా 940 లక్షల టన్నుల ఆహార ధాన్యాలను ఉత్పత్తి చేసుకోవచ్చు. ఈమొత్తం ఆహారధాన్యాలు 45 కోట్ల మందికి మాత్రమే సరిపోతాయి. ఈపాటికే భారతదేశపు జనాభా యీ సంఖ్యను మించిపోయిన సంగతి మీరెరిగినదే. పైపెచ్చు ఆహార ధాన్యాల ఉత్పత్తి మనఅంచనాల ప్రకారం అధికంకాలేదు. అది కొద్దిగా మందగించింది. అందుచేత మనకు కుటుంబ నియంత్రణ కన్న గత్యంతరంలేదు. అదొక్కటే జనాభా పెరుగుదలను అరికట్టడానికి శక్తివంతమైన మార్గం. అర్థాకలి, పోషకాహార లోపం మొదలైన దుష్ఫలితాలనుండి దేశాన్ని రక్షించాలంటె అదొక్కటే తగినమార్గం. కనుక మనదేశంలో 1000కి 40 చొప్పున వున్న జననాల రేటును 25కుతగ్గించ డానికి వీలుగా కుటుంబనియంత్రణను తీవ్రతరం చేయడమే తమ లక్ష్యంగా పెట్టుకుందాం.

## బహుళప్రచారం పొందిన 'లూప్'

కుటుంబ నియంత్రణలో అనేకరకాల కాంట్రసెప్టివ్ పద్ధతులు అమలులో వున్నట్టు మనకు తెలిసినవిషయమే. అన్ని కుటుంబనియంత్రణ క్లినిక్కులలోను సాధారణంగా వీటిని సిఫారసు చేస్తుంటారు. వీటన్నిటిలోకి ఈదేశానికి బాగా సరిపోయే పద్ధతి 'లూప్' పద్ధతి. పైగా యిది అతి శ్రేష్ఠమైనదికూడా. అందుకని ప్రభుత్వంకూడా ఈ 'లూప్' ఉద్యమాన్ని విస్తృతంగా దేశస్థాయిలో 1965 జూలై నుంచి ప్రారంభించింది. ఇతర పద్ధతులకన్నా 'లూప్' పద్ధతి ఎందుకు శ్రేష్ఠమైనదో యీ దిగువ కారణాలను పరిశీలిస్తే అర్థమవుతుంది.

(1) ఉత్పత్తిఖర్చు తక్కువ (2) తేలికగా దీనిని ధరించవచ్చు. (3) కాన్పుకు కాన్పుకు మధ్య వ్యవధిని మనకు అనుకూలంగా మార్చుకోవడానికి అనువైన సాధనం. ఉత్తర ప్రదేశ్‌లోని కాన్పూరులో 10 లక్షల రూపాయల ఖర్చుతో ప్రభుత్వం నెలకొల్పిన లూప్ ఫ్యాక్టరీ రోజుకు 30,000 లూప్‌లను తయారుచేస్తున్నది. దేశ అవసరాలకు తగినంతగాయిక్కడ అవి తయారవుతున్నాయి.

ఆంధ్రప్రదేశ్‌లో కుటుంబ నియంత్రణ కార్యక్రమం 1957లో ప్రారంభించబడింది. ప్రస్తుతం ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలకు అనుబంధించబడి 306 గ్రామీణ కుటుంబనియంత్రణ క్లినిక్కులు ; పట్టణాల్లో, నగరాలలో 65 పట్టణ కుటుంబనియంత్రణ క్లినిక్కులు యిప్పుడు పనిచేస్తున్నాయి. వీటికి తోడు హైదరాబాదు, సికిందరాబాదు నగరాలలో 49 కుటుంబనియంత్రణ కేంద్రాలు వున్నాయి. 1965–66లో కుటుంబ నియంత్రణ విస్తరణ కార్యక్రమం చేపట్టడంకూడా జరిగింది.

## నవశకం

లూప్ పద్ధతిని ప్రవేశపెట్టడంతోను, కుటుంబ నియంత్రణ కార్యక్రమంలో దాని ప్రయోజనాన్నిగూర్చి ప్రచారంచేయాలని నిశ్చయించడంతోనూ మనరాష్ట్రంలో ఒక కొత్తశకం ఆరంభమైంది. హైదరాబాదు నగరంలోని అన్ని పెద్ద ఆసుపత్రులలోనూ, డిస్పెన్సరీలలోనూ; మహిళా డాక్టర్లుగల అన్ని జిల్లా ఆసుపత్రులలోనూ, తాలూకా ఆసుపత్రులలోనూ లూప్‌ను ఉపయోగించే సౌకర్యాలు యిప్పుడు కల్పించబడ్డాయి. భారత ప్రభుత్వం ఏర్పాటుచేసిన కేంద్ర పరిశీలక బృందం పరిశీలనను బట్టి ఆంధ్రప్రదేశ్‌లో కుటుంబనియంత్రణలో అభివృద్ధి తగినంతగా లేకున్నా నిరాశజనకంగా మాత్రం ఏమిలేదు. 1966ఆగస్టు మాసాంతానికి మనరాష్ట్రంలో లూప్‌లను అమర్చిన కేసులు 119, 031. అదికాక సగటున నెలకు 2000 వసెక్టమీ ఆపరేషన్లు నిర్వహించ బడుతున్నాయి.

ఇంతకుపూర్వం యీరంగంలో స్వచ్ఛంద సంస్థలు చాలా కృషిచేశాయి. ఈనాడు వాటికృషి మరింత విస్తృతం కావలసియున్నది.

తమ తమ శాఖలద్వారా యీ సంస్థలు బాగాకృషిచేసి కుటుంబ నియంత్రణ అవసరాన్ని ప్రజలు గుర్తించేటట్టుచేసి, వారిలో మానసిక పరివర్తనకు ఎంతగానో తోడ్పడ్డాయి. ఈ సంస్థలు చేసిన సహాయాన్నిగుర్తించి యిప్పుడు భారత ప్రభుత్వం వీటికి కుటుంబనియంత్రణ కార్యక్రమాలను అమలు పరిచేందుకుగాను 100 శాతం ఆర్థిక సహాయాన్ని అందజేస్తున్నది. అందువల్ల స్వచ్ఛంద సంస్థలు—ముఖ్యంగా మహిళాస్వచ్ఛంద సంస్థలు—ముందుకువచ్చి, యీ కార్యక్రమాన్ని విస్తృత పరిచి, దీని విజయానికి తోడ్పడాలని కోరుతున్నాను.

## త్రివిధకార్యక్రమం

గ్రామీణ భారతదేశం యింకా నిరక్షరాస్యతతోనూ, మూఢనమ్మకాలతోనూ జీవిస్తున్నది. అందువల్ల క్రొత్తధోరణులు, క్రొత్త సాంఘికవ్యవస్థ ఆచరణలోకి రావడానికి మరికొంత కాలం పట్టవచ్చు. అందువల్ల దేశవ్యాప్తంగా త్రివిధకార్యక్రమాన్నొక దానిని అమలు పరచడం చాలా అవసరం. మొదటిది—పిల్లలను కనే వయసుగ్రూపుదంపతులలో కుటుంబనియంత్రణా ధోరణిని కలిగించడం. రెండవది—కుటుంబనియంత్రణ పద్ధతులు, తదితర సమాచారాన్ని అందజేయడం. మూడవది—కుటుంబనియంత్రణకు సంబంధించిన సేవలను అందించడం. భారతదేశంలో పిల్లల్ని కనే వయసుగ్రూపు దంపతులు 9 కోట్లు వున్నారని అంచనా.

కుటుంబనియంత్రణకు సుముఖుల్నిచేయడం మొదటిపని. పరిమితంగా పిల్లలు వుండడం అనేకరకాలుగా లాభదాయకమన్న విషయాన్ని ముందుగా దంపతులు గుర్తించాలి. నిజానికి ప్రజలు

యీ విషయాన్ని గుర్తించారనే చెప్పవచ్చు. వారు గుర్తించినప్పటికీ అంత్త ఆసక్తి చూపించడంలేదు. కుటుంబాన్ని పరిమితం చేసుకోవలసిన అవసరాన్ని గూర్చి ప్రజలతో ఎవరైనా చర్చిస్తే అప్పుడు ఆ ప్రజలకు కుటుంబనియంత్రణపై ఆసక్తి ఏర్పడడానికి అవకాశంవుంటుంది. ఆ విషయాన్ని మనం విస్మరించకూడదు.

రెండవది-ప్రజలకు కుటుంబ నియంత్రణకు సంబంధించిన సమాచారాన్ని అందజేయడం. కాంట్రసెప్టివ్ పద్ధతులవల్ల ప్రజలమత విశ్వాసాలకు దెబ్బతగులుతుందని భయపడే ప్రజల భయాలను పోగొట్టి, ఈ విషయంలో ప్రజలకుగల సందేహాలను పటాపంచలు చేయడం చాలా అవసరం. తమ తమ అభిరుచులకు వీలుగా ఆయా పద్ధతులను అమలు పరచడానికి తమంతతాముగా ముందుకువచ్చే ప్రజలకు వివిధ కుటుంబనియంత్రణ పద్ధతుల సమాచారాన్ని ఉచితంగా అందజేయాలి. గ్రామీణ ప్రాంతాలలోని నిరక్షరాస్యులుకూడా తేలిగ్గా ఆయావిషయాలను అర్థంచేసుకొనేటట్టు వుండాలి.

ఇక మూడవది. కుటుంబనియంత్రణ పద్ధతులను అమలు జరపడం. ఇది కుటుంబ నియంత్రణ క్లినిక్కులు అందజేసే సేవల మీద ఆధారపడి వుంటుంది. ఉదాహరణకు కుటుంబ నియంత్రణ ఉపకరణాలను పొందడానికి ఎక్కడో ఊరిలో ఆచివర క్లినిక్కుకు వెళ్ళవలసిరావడం, గంటల తరబడి వరుసల్లో నిలబడడం, ఇరకాటంలో పెట్టే ప్రశ్నల్ని అడిగించుకోవలసిన పరిస్థితిని ఎదుర్కోవలసిరావటం-యిటువంటి వాటికి తావుండగూడదు. ఆయా ఉపకరణాలను తగినంత గుంభనంగా పొందడాని అవకాశాలువుండాలి. ఇప్పుడుగాని ముందుముందుగాని కుటుంబ నియంత్రణ కార్యక్రమాన్ని తీవ్రంచేసే సందర్భంలో యీ విషయాన్ని దృష్టిలో వుంచుకుని ప్రవర్తిస్తే అధిక ప్రయోజనాలను పొందవచ్చు. కుటుంబనియంత్రణ విషయంలో, మనం చేస్తున్న కృషి, మన పద్ధతులను మనం కొనసాగిస్తూనే ముందుకు పోవడం అవసరం. మనం చేస్తున్న కృషిలో లోటుపాట్లు ముందు ముందు తెలిసొస్తాయి.. వాటితో పాటు ఆలోటుపాట్లను సవరించుకునే అవకాశాలు కూడా ఏర్పడతాయి. కొత్తగా నడవడం నేర్చుకుంటున్న పసిపాప నాలుగైదుసార్లు కిందపడక తప్పదు కదా. ఆ తర్వాత తనే చకచకా నడిచివేస్తుంది.

కుటుంబనియంత్రణ పక్షోత్సవాలప్పుడూ, ఆ తరువాత కూడా కుటుంబనియంత్రణకు సంబంధించిన ప్రతి అంశాన్నీబాగా వెలుగులోకి తీసుకురావడానికి ప్రయత్నించాలి. పంచాయతీలు, జిల్లా పరిషత్తులు, పాఠశాల ఉపాధ్యాయులు, తదితర విస్తరణ కార్యకర్తలు-వీరంతా యీ కార్యక్రమంలో పాల్గొనేటట్టు విస్తృత అవకాశాలను కలిగించాలి. కుటుంబనియంత్రణకు యితోధికంగా ప్రజల తోడ్పాటులభించేటట్లు పార్లమెంటు సభ్యులు, రాష్ట్ర శాసనసభసభ్యులు, మునిసిపాలిటీలు, కార్పొరేషన్లు తీవ్రంగా కృషి చేయాలి. కుటుంబనియంత్రణ శిక్షణ శిబిరాలను, పునశ్చరణ తరగతులను నిర్వహించాలి. ప్రభుత్వమూ, స్వచ్ఛంద సంస్థలు కలిసి యీ విషయంలో కృషిచేస్తే అధిక ఫలితాలను సాధించవచ్చు. 'పరిమిత కుటుంబం ఆనంద దాయకం' అన్న నినాదాన్ని మనం ఎలుగెత్తిచాటుదాం. గృహమే స్వర్గసీమకదా. అగృహాన్ని కల్యాణప్రదం చేసినప్పుడే ఆనందాన్ని అందుకోగలం. గృహాన్ని కల్యాణప్రదం చేయాలంటే గృహానికి మూలమైన కుటుంబాన్ని పరిమితంగా ఉంచుకోవాలి. కనుక 'పరిమిత కుటుంబం ఆనంద దాయకం'



# ఎంప్లాయిమెంట్ ఎక్స్ఛేంజ్‌లకు ఖాళీల ప్రకటన

ఎంప్లాయ్‌మెంటు ఎక్స్ఛేంజిల (విధిగా ఖాళీల ప్రకటన) చట్టాన్ని 1959లో పార్లమెంటు రూపొందించింది. ఈ చట్టం 1960 లో ఆంధ్ర ప్రదేశ్‌లో అమలులోకి వచ్చింది. ఈ చట్టం ప్రకారం పబ్లిక్ రంగంలోని యజమానులందరూ తమ సంస్థల్లో ఏర్పడిన ఖాళీలను గూర్చి-ఆ ఖాళీల కాల పరిమితి, ఆ ఉద్యోగానికి సంబంధించిన జీత భత్యాలతో సంబంధం లేకుండా---ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజిలకు తెలియపరచాలి. 25 మంది, అంతకన్న ఎక్కువ మంది సిబ్బందిగల ప్రయివేటు రంగంలోని సంస్థల యజమానులుకూడా 3 నెలలకు తక్కువ కాకుండానూ, నెల సరి జీతం రూ 60 లకు తగ్గకుండానూవున్న ఉద్యోగాల ఖాళీలను తప్పనిసరిగా ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజిలకు తెలియ పరచాలి. ఈ చట్టం పరిధిలోకి వచ్చే యజమానులు వారికి సరఫరా చేయబడిన ఫారాల్లో, మూడు నెలల కొకసారి ఖాళీల వివరాలను, ఉద్యోగకల్పనా వివరాలను పూర్తిచేసి ఆయా ప్రాంతాలలోని ఎంప్లాయ్‌మెంటు ఎక్స్ఛేంజిలకు అందజేయవలసి వుంటుంది. ఈ వివరాలను అందజేయనియజమానులకూ, ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజి అధికారులు తణిఖీకి వెళ్ళినప్పుడు వీటికి సంబంధించిన రికార్డులను అందజేయని యజమానులకూ ఈ చట్టం ప్రకారం రూ 200 మొదలుకొని రూ 1000 ల వరకు జరిమానా విధించడం జరుగుతుంది.

చట్టం అమల్లో ఉన్నప్పటికీ కొంత మంది యజమానులు తమ సంస్థలలోని ఖాళీలను ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజిలకు తెలియ పరచడం లేదు. ప్రయివేటు, పబ్లిక్ రంగాలలోని యజమానులు తమ సంస్థల్లోని ఖాళీలను గూర్చి వెంటనే ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజిలకు తెలియ పరచి సహకరించ వలసిందిగా హైదరాబాదులోని ఎంప్లాయ్‌మెంట్ శిక్షణ డైరెక్టరు కోరుతున్నారు. ఖాళీలను తెలియ పరచని యజమానులు చట్టం ప్రకారం శిక్షింపబడతారనికూడా ఆయన తెలియ జేస్తున్నారు.

ఇతర వివరాలకు జిల్లా ఎంప్లాయ్‌మెంట్ అధికారులను గాని, హైదరాబాదులోని ఎంప్లాయ్‌మెంట్ శిక్షణ డైరెక్టరును గాని సంప్రదించ వచ్చును.

# భారత రిపబ్లిక్ దినోత్సవము

కొండపల్లి వాసుదేవరావు

భారత దేశమునకు స్వరాజ్యము 15వ ఆగస్టు 1947న ప్రాప్తించినది అనగా ఆ రోజున భరతమాతకు దాస్యవిముక్తి గలిగినది. ఈ దాస్యవిముక్తికై భారతీయులు ఎడతెగని పోరాటము సలిపిరి. దాస్యవిమోచనకై పోరాడుట యన సర్వసాధారణముగా సాయుధ స్వాతంత్ర్యసమరము సాగించుట యని తెలియును గాని భారత యోధులు బ్రిటిష్‌వారిబలముల నెదుర్కొనుటకు వారియొద్ద ఎట్టి సామగ్రియు వస్తుసముదాయమును లేదు. బ్రిటిష్‌వారు రాజ్యము చేత నందుకున్న తరువాత చేసిన ప్రప్రథమకార్యము దేశీయులందరిని నిరాయుధులజేయుట. ఆయుధములు పట్టుటకు, వాడుటకు తగిన చట్టముచేసి అన్ని వైపులనుంచి దిగ్బంధనములుచేసి నిరాయుధులనుగా నిస్సహాయులనుగా చేసినారు. రాజ్యతంత్రమును నిరాటంకముగా యథేచ్ఛగా నడిపించిరి. కొన్ని ప్రాంతములను నామమాత్రమే స్వతంత్రముగా నుంచిరి. ఇంగ్లీషులో విద్యావిధానమును ప్రవేశపెట్టిరి. రహదారులు, రైలుమార్గములు సముద్రయానములకు అనేక అవకాశములు కల్పించి హిమ్సనదీతీరమునుండి యావద్భారతావనిపై తమరాజ్యమును విస్తరింపజేసి నిరంకుశప్రభుత్వము చేయ దొడంగిరి. తమ కెదురు చెప్పెడివారిని సామదానభేదదండోపాయములు అను చతుర్విధోపాయములననుసరించి అణచివేసిరి. మిత్రలాభ మిత్రభేదనీతిని నడపిరి. భారతీయులివన్నియు కనిపెట్టి ఆంగ్లేయులను తరిమివేయుటకు అనేక తీవ్రప్రయత్నములు చేయుచునేయుండిరి.

స్వరాజ్యము భారతీయుల జన్మహక్కు అనే మౌలిక సూత్రమును నిర్వచించినది కీర్తిశేషులైన లోకమాన్య బాలగంగాధరతిలక్. ఆ మహనీయుడే స్వరాజ్య భిక్షాపాత్రను చేబట్టిన వామనావతారమై బ్రిటిష్ సామ్రాజ్యమను బలిచక్రవర్తిని పాతాళమునకు త్రొక్కివేయుటలో ప్రథమపాదము నుంచిన చారిత్రక పుణ్యపురుషుడు. అందువల్లనే ఆయన లోకమాన్యుడను కీర్తి గడించెను.

లోకమాన్యుడు, అవతారము చాలించునప్పుడు పరశురాముడు శ్రీరామునికి బాధ్యత ఒప్పజెప్పి అతనిలో అంతర్హితుడైనట్లు లోకమాన్యుడస్తమించిన తరువాత గాంధీమహాత్మ డనుమార్తాండుడుదయించెను. మహాత్ముడు లోకమాన్యునివద్ద రాజ్యతంత్రవిజ్ఞానము నార్జించెను. రాజకీయరంగములోని యెత్తుపల్లములను కడు తెలివితో జాగ్రత్తగా లోకమాన్యునివద్ద తెలుసుకొనెను. ఆ మహానుభావునికి అంతరంగికమిత్రుడై అంతేవాసివలె మెలగి వేదాంతవిజ్ఞానమును మతసంప్రదాయక శిష్టాచారములను స్థితప్రజ్ఞాలక్షణములను నిస్వార్థ దేశసేవా తత్పరతను, రాజకీయ శత్రుసాధనపటిమను ప్రజానుమతమైన నడవడిని, స్త్రీజన, హరిజనోద్ధరణాసక్తిని త్యాగమహిమను నిరక్షరాస్యతానిర్మూలనావశ్యకతను పాశ్చాత్య సంస్కృత్యభిలాష నిరోధనావశ్యకతను నేర్చుకొనెను. యావద్భారతావనికి ఏకైకరాజకీయ రంగస్థలమైన భారత జాతీయ కాంగ్రెసు మహాసభను నిర్విరామకృషిచే పటిష్ఠముగా చేయుటకు తగిన ప్రయత్నమును కార్యదీక్షా పరత్వమును, విద్యావ్యాప్తికై నిరంతర నిర్విరామ యత్నావసరమును, లభ్యమైన సామగ్రిచే శత్రునిర్మూలన కార్యక్రమోపక్రమ ధురంధరత ఇత్యాదులను గాంధీ మహాత్ముడు లోకమాన్యునినుండి క్షుణ్ణముగా నేర్చుకొనెను. తబిసివస్తాదువలె రాజకీయ రంగములో దూకి మల్లులవలె బాహువులు చఱచి నోరెత్తి భారతావనీ సుపుత్రులనందరిని దాస్యవిముక్త్యాచరణ కార్యదీక్షకొఱకై యాహ్వానించెను.

లోకమాన్యుని శిక్షణ ఫలితముగా మహాత్ముడు ఆంగ్లేయుల నిరసించుటకై యెన్నియో యుపాయములను పన్నెను. వాసుదేవుని సుదర్శనము రాక్షసనిర్మూలనము చేసినట్లు మహాత్ముడు 'తకలీ' చక్రము నుపయోగించుటకై నిశ్చయించెను. దౌర్జన్యరహితమైన సహాయనిరాకరణోద్యమమును యోచించెను. సత్యాహింసలు అను అసమాన శస్త్రాస్త్రములను వినియోగించెను, అవి అక్షయతూణీరములవలె పనిచేసెను. ఆంగ్లేయులను పారద్రోలుటకు ఆ రెండు తప్ప ఇతరబలములు నిష్ప్రయోజనములని ప్రజలకు బోధించెను. 1921 లో గొప్ప ఉద్యమమును లేవనెత్తి, దానికి 'దౌర్జన్యరహిత సహాయనిరాకరణము' అని నామకరణము చేసెను. ఈ ఉద్యమలక్ష్యములు "(1) కోర్టుకెక్కవద్దు, (2) శిస్తులు చెల్లించవద్దు, (3) విదేశ వస్తువులను బహిష్కరింపవలెను, (4) మద్యపానము నిషేధించవలెను, (5) చేతితో వడికిన నూలుచే వస్త్రములు తయారుచేసి ధరించవలెను, (6) సత్యమును, అహింసను అవలంబించి సత్యాగ్రహమును కొనసాగించవలెను," అని. ఈ సూత్రములు బ్రిటిష్‌వారిపాలిట మారణాస్త్రములవలెపని చేసెను. వారు తికమకలాడిరి, నిట్టూర్పులు విడిచిరి. సైన్యము పనికిరానిదాయెను. జైళ్ళునిండెను. ప్రభుత్వమునకు రావలసిన ఆదాయము లోపించెను. ఖర్చులు విపరీతముగా పెరిగెను. విదేశవ్యాపారము సన్నగిల్లెను. బ్రిటిష్‌వారిలో అసూయాద్వేషములినుమడించెను. రాజ్యపాలనము దుర్భరమాయెను. కొన్ని కొన్ని రాజ్యాంగపు మార్పులను ప్రవేశపెట్టిరి. అనగా మార్లీ మింటోరిఫారమ్స్, మాంటెగ్ చెమ్స్‌ఫోర్డు రిఫారమ్స్ వంటివి. వీటివల్ల కూడ లాభము లేకపోయెను.

మొదటి ప్రపంచ సంగ్రామము సంభవించెను. జర్మనీయులు దెబ్బతీసిరి. ఆంగ్లేయులు గాంధీజీని ఆశ్రయించి సహాయమును నపేక్షించిరి. ఆయన సమ్మతించి ఆంగ్లేయులతో మొదటి ప్రపంచ సంగ్రామమున సహకరించెను. యుద్ధము ముగిసెను. జర్మనీ ఓడిపోయెను. బ్రిటిష్‌వారికి జయము సిద్ధించెను. మహాత్ముడు బాధ్యతాయుత ప్రభుత్వస్థాపనకై పట్టుబట్టెను. ఆంగ్లేయులు తమవాగ్దానమును వమ్ముచేసి హింసాకాండకు బూనిరి. గాంధీ సత్యాగ్రహోద్యమమును తీవ్రతరముజేసెను. ఆంగ్లేయులు హింస కుపక్రమించిరి. రౌలతుశాసనం తయారుచేసిరి. డయరను దుశ్శాసనుని సైన్యాధికారినిచేసి భారతీద్రౌపదిమానభంగమున కుద్యమించిరి. వాసుదేవుని సుదర్శనమువలె గాంధీజీ

చక్రమడ్డు పెట్టెను. ఈ రణరంగములో భారత మహావీరుడైన లాలాలజపతిరాయ్ తన ప్రాణములొడ్డుపెట్టి సుస్థిరమైన కీర్తిని పొందెను. దేశమంతయు అల్లకల్లోలమున కాలవాలమాయెను. బ్రిటిష్‌వారిచేతినుంచి అధికారము తప్పిపోవు చిహ్నములు సూచించెను. 1857లో సైనికుల తిరుగుబాటు వారిని కదలించెను. రాయబారములు మొదలిడిరి. 1935లో భారత ప్రభుత్వపు చట్టము చేసిరి. 1937లో దానిని అమలు పెట్టిరి. ప్రభుత్వములో పాల్గొనుటకు గాంధీ సమ్మతించెను, ద్విప్రభుత్వ పాలనావిధానమును అమలులోకి తెచ్చుటకై మొదటి సారిగా ఎన్నికలు జరిగెను. కాంగ్రెసు 'పోలు'లో దుమారము పట్టినట్టు ఇతరులను ఊడ్చివేసి ఘన విజయము సాధించి ఆంగ్లేయుల కండ్లుతెరిపించెను.

ఇంతలో రెండవ ప్రపంచ మహాయుద్ధము 1939లో వచ్చెను. ఆంగ్లేయులు యుద్ధమును జయించిరి కాని శాంతిని జయించలేక పోయిరి. 1942లో మహాత్ముడు ఇదేసమయమని' భారత దేశమును విడువండి' అను 'క్విట్ ఇండియా' ఉద్యమమును లేవదీసెను. 1945 లో రెండవయుద్ధము ముగిసెను. బ్రిటిష్ ప్రభుత్వము 1945 అక్టోబరు ఎన్నికలలో లేబరు పార్టీచేతికి వచ్చెను. మహావీరుడైన చర్చిలు ప్రతిపక్ష నేతగా కూర్చోవలసి వచ్చెను. అట్లీ ప్రధాని పదవిని సంభాళించెను. భారతదేశమునకు స్వాతంత్ర్యము నీయవలెనని నిశ్చయ మాయెను. మౌంటుబాటన్ మహాశయుని కడపటి వైస్రాయిగా నియమించిరి. ఆమహానుభావుడు మార్చి 1947లో చార్జితీసుకొని 15వ అగస్టు 1947 రోజున భారతదేశమునకు స్వాతంత్ర్యము ప్రాప్తించువరకు వైస్‌రాయిగా నుండెను. త్రివర్ణపతాక మెగురవేసిరి. గాంధీజీ ఆనంద బాష్ప బిందువులు రాల్చెను. కాని ఆయన చింతాక్రాంత చిత్తుడాయెను. ఎందువల్లననిన, భారతదేశము రెండు ముక్కలుగా ఖండింపబడి ఒకటి భారతము, రెండవది పాకిస్థానము అని విభేదింపబడెను. గాంధీజీ విభేదమున కొప్పలేదు. కాని రెండవ మార్గము కనుపించనందున కాంగ్రెసు నిర్ణయించిన యీ విధానమున కొప్పవలసి వచ్చెను. స్వాతంత్ర్యానంతరము పాలనబాధ్యత రాజ్యాంగనిర్ణయ విచారభారము కాంగ్రెసు నెత్తిపై బడెను. రాజ్యాంగ నిర్ణయ మహాసభను ప్రారంభించినది మన ప్రెసిడెంటైన రాధాకృష్ణ పండితుడే. అన్ని దేశముల రాజ్యాంగ ప్రణాళికలు చదువ బడెను. డాక్టరు అంబేడ్కరును ఈ పనికై నియమించిరి. రాజ్యాంగ ప్రణాళిక యొక్క ముసాయిదా సంఘములో అనుభవజ్ఞులు శాస్త్రవేత్తలు మేధాసంపన్నులు సుప్రసిద్ధ మహా విజ్ఞానులునైన భారతీయులను ఎన్నుకొనిరి. ఈ భారత రాజ్యాంగపు ముసాయిదా 26 నవంబరు 1949 లో ఆమోదింప బడెను. కీర్తిశేషులైన బాబు రాజేంద్రప్రసాద్ ఈ మహాసభ కధ్యక్షత వహించిరి. 26వ జనవరి 1950 రోజున రాజ్యాంగ విధానమును అమలులో పెట్టవలెనని నిర్ణయింప బడెను. ఈ తారీఖు నేర్పరించుట కొక రాజకీయ బలవత్తర కారణము గలదు. 26 వ జనవరి 1929 లో లాహోరు కాంగ్రెసు మహాసభలో భారతదేశమునకు సర్వ స్వాతంత్ర్యమును జేకూర్చ వలెనను తీర్మానము ఏకగ్రీవముగా ఆమోదింపబడెను. అందు వలన భారత రాజ్యాంగము అదే తారీఖున అమలులో పెట్టబడినది. కావున ప్రతి భారతీయునికి రెండు దివసములు పర్వదినములు. వాటిని మరవకూడదు. ఆరోజున ప్రతిజ్ఞలు తీసుకోవలెను. మొదటిది 15వ ఆగస్టు. ఇది భారత స్వాతంత్ర్యదినోత్సవము. ఈ రోజున దేశ స్వాతంత్ర్యమును నిలబెట్టగలనని ప్రతిజ్ఞచేయ వలెను. భారతదేశము శత్రువులచే చుట్టబడియున్నది_ఎరు భారతదేశమును క్రిందికి లాగవలెనని ఔత్సుక్యముతో నున్నారు. వీరు కుచ్చెళ్ళలో పాములు. వీరి ఎడల జాగరూకతతో మెలగ వలెను. వీరికి మనదేశములో గోముఖ వ్యాఘ్రముల వంటి భక్తులున్నారు. వీరు దేశములో అంతర్గత క్షోభ లేవదీసి సరిహద్దులలో దెబ్బ తీయవలెనని కృత నిశ్చయులై యున్నారు. వీరిని జాగరూకతతో కనిపెట్ట వలెను. అవసరమైనచో ఎంతైనా త్యాగమును జేయుటకు బద్ధకంకణులమై యుండవలెను.

రెండవది 26వ జనవరి. ఇది రాజ్యాంగ దినమహోత్సవ సమయము. మన రాజకీయ విజ్ఞత ఇందులో నిమిడియున్నది. మన హక్కులు బాధ్యతలు రెండునూ విశదీకరింపబడినవి. రాజ్యాంగ విధాన సూత్రములు చాల ముఖ్యమైనవి. ప్రభుత్వ పరిపాలన ఈ రాజ్యాంగ విధాన సూత్రములపైన ఆధారపడియున్నది. 14, 19 సూత్రములలో ప్రాథమిక హక్కులు నిర్వచింపబడినవి. (ఆదేశక సూత్రాలలో) ప్రభుత్వ విధానములన్నియు సూత్రప్రాయముగా చెప్పబడినవి. వీటిని అమలులో పెట్టు బాధ్యత ప్రజాప్రభుత్వముల (కేంద్రము_రాష్ట్రము) పైనున్నది.

ఇదేవిధముగా భారత రాజ్యాంగములలో ముఖ్యమైనవి. న్యాయవ్యవస్థ, రాజ్యపాలనా వ్యవస్థ, శాసనసభలు ఈ మూడిటి సమన్వయము చాలా అవసరము. ఈ మూడు సర్వ స్వతంత్ర వ్యవస్థలు. ఒకటికన్న మరొకటి ఎక్కువ తక్కువ అను ప్రశ్నయేలేదు. అన్నియు సమాన సర్వ స్వాతంత్ర్యానుభవ సంస్థలే. కాని వీటి సమన్వయ మెంతేని అవసరము. వీటిలో అంతర్యుద్ధము చెలరేగినచో అది బహిర్యుద్ధముగా మారి దేశములో అల్లకల్లోలములకు దారితీయును. పాలనా వ్యవస్థను సరియైన మార్గములో, అనగా, రాజ్యాంగ సూత్రానుగుణముగా నడచునట్లు చేయుబాధ్యత న్యాయసంస్థలయందున్నది. శ్రేయో రాజ్యమున కనుగుణమైన చట్టములను చేయు పాలనా వ్యవస్థకు దోహదము చేయుట, అవసరమైనచో సరిదిద్దుట లోకసభ, రాజ్యసభ, శాసనసభ శాసనమండలుల కర్తవ్యములు. పరిపాలనా వ్యవస్థ యెట్లుండవలెనో మహాభారతములో సభాపర్వములో నిర్వచింపబడినది. మన భారతరాజ్యాంగము భారతామ్నాయపతనానంతరము తయారు జేయబడక పోయినను ఈ ముఖ్యమయిన సూత్రము లన్నియు రాజ్యాంగ చట్టములో చేర్చబడియున్నవి. వీటిని అమలుపరుచుట యందు ప్రభుత్వమూ, ప్రజలు ఆదర దృష్టిని చూపవలసి యుండును. సత్యాహింసలు భారత స్వాతంత్ర్యమునకై యుపయోగింపబడిన పవిత్రసూత్రములు. మనము ఈ రిపబ్లికు దినోత్సవ సందర్భమునందు సత్యాహింసలకై ప్రతిజ్ఞబూనవలెను.



సీరియల్

# మహాభారతము

తెలుపగంటుల లక్ష్మీశాస్త్రి

## 5

ఒకనాడు శాంతనుడు వనమునందు యమునానదీతీరమున పోవుచు అపూర్వ మైనసుగంధమును అఘ్రాణించి యది యెక్కడిదై యుండు నని దానిని కనిపెట్టుటకు అంతట తిరిగెను. అచ్చట రూపయౌవనసంపన్న యగుదాశరాజకన్యను 'సత్యవతి' యను నామెను చూచెను, ఆమెవృత్తాంత మడిగి తెలిసికొనెను. ఆమెయందు మోహము కలవాడై, ఆమెను తన కిచ్చి పెండ్లి చేయు మని ఆమెతండ్రిని కోరెను, అతడును సంతసించి "రాజా ! నీవు ఈమెకు పుట్టబోవుకుమారునకు నీరాజ్యమునిచ్చు నట్లు మాట యిచ్చినచో ఈమెను నీకు ఇచ్చి వివాహము చేసెదను. అని చెప్పెను. శాంతనుడు మిక్కిలి చింతించి, 'దేవవ్రతుని వంటి పుత్రుడు, పరాక్రమవంతు డుండగా ఈతని కెట్లు మాట యిత్తును.' అని విచారించుచు ఇంటికి పోయి దాశకన్యయందలి విరాళిచేత రాజ్యకార్యములు మాని చింతించు చుండెను. అట్లుండు తండ్రిని జూచి దేవవ్రతుడు తండ్రికడకు పోయి యాతని చింతకు కా[illegible] మడిగెను, శాంతనుడు జరిగిన సంగతి చెప్పెను. "నీ వొక్కడవే కొడుకవు. నీవును మహాపరాక్రమశాలివి. ఏ యుద్ధములోనో నీవు మరణించినచో వంశసంతతి విచ్ఛిన్న మగును. కనుక నాకు ఇంకను పుత్రులు కావలె నని కోరిక యున్నది, దానికిగాను వేరుపెండ్లి చేసికొనుట అవసరము. అని చెప్పెను. అది విని దేవవ్రతుడు వెంటనే దాశరాజుకడకు పోయి తనతండ్రికిగాను ఆతనికన్యకను గోరెను. అతనివలన మరల ఆమాటనే విని, తాను తండ్రిహితమును గోరి 'రాజ్యత్యాగము చేసి సత్యవతిపుత్రునకే రాజ్యపట్టాభిషేకము చేసి, అతనికి నేను అండగా నుండెదను." అని ప్రతిజ్ఞ చేసెను. కాని దాశరాజు 'నీవు రాజ్యము విడిచినను, నీకు పుట్టబోవుకొడుకు విడుచునా ?' అని తిరిగి ప్రశ్నించెను. దానికి మరల దేవవ్రతుడు "నేను బ్రహ్మచారిగానే యుండెదను. గృహస్థుడనై పుత్రసంతతి లేకున్నను నాకు పుణ్యలోకములు ప్రాప్తించునుగాక" అని చేయెత్తి అందరిసమక్షములో రెండవ ప్రతిజ్ఞ చేసెను. ఇట్లు పితృహితార్థమై అతిభీష్మముగా ప్రతిజ్ఞలు చేసినదేవవ్రతునిపై దేవతలు పుష్పవర్షము కురిసి అతనికి 'భీష్ముడు' అని బిరుదము నిచ్చి పొగడిరి. దాశరాజు సంతుష్టుడై కన్య నిచ్చుటకు అగీకరించెను.

ఆమెను వెంట నిడుకొని దేవవ్రతుడు తండ్రికడకు పోయి ఆయన కామెను సమర్పించెను. తండ్రి మిక్కిలి సంతోషించి దేవవ్రతునికి 'స్వేచ్ఛామరణము' కలుగునట్లు వరమిచ్చెను. కనుక భీష్ముడు ఇష్ట మున్నంతకాలము జీవించ గలడు. అతనిని మృత్యువు ఏమియు చేయ జాలదు.



శాంతనునకు సత్యవతియందు 'చిత్రాంగదుడు, విచిత్ర వీర్యుడు, అనునిరువురు కొడుకులు పుట్టిరి. విచిత్రవీర్యునకు యౌవనము రాకపూర్వమే శాంతనుడు కాలధర్మమును పొందెను. అప్పుడు భీష్ముడు, జ్యేష్ఠు డగుచిత్రాంగదునకు రాజ్యపట్టాభిషేకము, తల్లియాజ్ఞప్రకారము చేసెను. అతడు ప్రపంచములో నెవరినిగూడ లక్ష్యము చేయక దేవదానవమనుష్యాదులను తిరస్కరించుచు గర్వియై తిరుగు చుండెను.

ఒకనాడు చిత్రాంగదు డనుపేరు గలగంధర్వు డొకడు వచ్చి చిత్రాంగదునితో కురుక్షేత్రమునందు సరస్వతీనదీతీరమున మూడేండ్లు యుద్ధము చేసి తనమాయాబలముచేత అతనిని చంపి

స్వర్గమునకు పోయెను. అప్పుడు భీష్ముడు, కనిష్ఠుడైనవిచిత్ర వీర్యునకు పట్టాభిషేకము చేసెను. అతడు ధర్మాత్ముడై భీష్ముని యాజ్ఞలో మెలగుచు, అతనిని సేవించుచు రాజ్యమును గైకొనెను.

## విచిత్రవీర్యుని వివాహము.

విచిత్రవీర్యుడు బాలుడగుటచేత భీష్ముడు తల్లియాజ్ఞగొని తానే రాజ్యవ్యవహారములను చూచుచుండెను, కొంతకాలమునకు విచిత్రవీర్యునకు యౌవనము వచ్చెను. అతనికి వివాహము చేయుటకు భీష్ముడు తలపెట్టెను. కాశీరాజు, 'అంబ, అంబిక, అంబాలిక' అనుతనముగ్గురుబిడ్డలకు ఏకకాలమునందు స్వయంవరము చేయుచున్నాడని భీష్ముడు విని తల్లియాజ్ఞగొని ఏకాకిగా వారాణసీపురమునకు పోయెను. భీష్ముడు స్వయంవరమంటపములో కూర్చొని యుండుటను చూచి యితరరాజులు నవ్విరి. "ఈవృద్ధుడేల స్వయంవరమునకు వచ్చెను, తాను బ్రహ్మచారి నని నేటిదాక చెప్పికొనుచు నేడు సిగ్గుమాలి పెండ్లికి వచ్చినాడు." అని పరిహసించిరి, వారిమాటలు విని భీష్ముడు క్రుద్ధుడయ్యెను. ఆముగ్గురుకన్యలను తనరథముపైన ఎక్కించుకొనెను. ఎదురు తిరిగినరాజులను జయించి యిట్లనెను:—

"రాజులారా ! వరుని పిలిచి సాలంకృతకన్య నిచ్చి చేయువివాహము బ్రాహ్మము. రెండుగోవులను, ఒకయెద్దును కన్యాశుల్కముగా తీసికొని కూతు నిచ్చి చేయువివాహము ఆర్షవివాహము, ధనమును తీసికొని కన్య 'నిచ్చునది ఆసురవివాహము' బలప్రయోగము చేసి బలాత్కారముగా కన్యను తీసికొని పోయి పెండ్లి చేసికొనుట 'రాక్షసవివాహము' వధూవరులయనుమతితో జరుగుపెండ్లి 'గాంధర్వ' మన బడును. మైమరచి మూర్ఛిల్లినకన్యను ఎత్తుకొనిపోయి చేసికొనువివాహమునకు 'పైశాచ మని' పేరు. వధూవరులను ఒకచోట చేర్చి, కొందరు వారిరువురిచే వివాహమునకు ప్రతిజ్ఞ చేయించి తరువాత వారితలితండ్రులద్వారా జరిపించుపెండ్లి ప్రాజాపత్య మన బడును, కొందరు యజ్ఞము చేసి, ఋత్విక్కునకు యజ్ఞదక్షిణగా కన్య నిచ్చి వివాహము చేయుదురు. దానికి దైవ మని పేరు, ఇట్లు వివాహములు ఎనిమిదివిధము లని తెలిసికొనుడు,

క్షత్రియులకు స్వయంవరవివాహము శ్రేష్ఠము. అందులోను, అడ్డు వచ్చినరాజులను ఓడించి కన్యను పెండ్లి యాడుట ఉత్తమోత్తమము. కనుక "నే నీముగ్గురిని బలప్రయోగముచేత తోడుకొని పోవుచున్నాను. మీకు శక్తి యున్నచో నాతో పోరాడి వీరిని విడిపించుకొనుడు." అని చెప్పి భీష్ముడు తనపైకి వచ్చిన రాజులందరిని ఓడించి ఆముగ్గురు కన్యలను రథముపైన తోడుకొని హస్తినాపురమునకు పోయెను. అతనిని వెన్నంటి శాల్వరాజు యుద్ధము చేసెను. కాని అతడుగూడ భీష్మునకు ఓడి పారిపోయెను. అతడు 'అంబ'ను ప్రేమించి యుండెను.

ఇట్లు గెలుచుకొని తెచ్చినముగ్గురుకన్యలను తమ్ముడగు విచిత్రవీర్యున కిచ్చి భీష్ముడు పెండ్లి చేయ దలచెను, వారిలో పెద్దదియగు అంబ, "తాను మున్నె సాల్వుని వరించితి ననియు, తనను అతని కడకే పంపుట ధర్మ మనియు" భీష్మునితో ననెను, దాని కంగీకరించి భీష్ముడు అంబను బ్రాహ్మణులవెంట శాల్వరాజు కడకు పంపెను. తల్లియనుమతిపైన అంబికను, అంబాలికను తమ్మున కిచ్చి పెండ్లి చేసెను. అతడు కామలోలుడై యేడేండ్లు వారితో యౌవనసుఖము నిరంతరము అనుభవించి క్షయరోగపీడితుడై మరణించెను. విచిత్ర వీర్యునకు భీష్ముడు ప్రేతకార్యములను చేసి సత్యవతి యనుమతిపై రాజ్యకార్యములను నిర్వహించుచుండెను.

పుత్రశోకపీడితురాలైన సత్యవతి కోడండ్రను ఊరడించి భీష్ముని పిలిచి "నాయనా ! నీపితృవంశ, మాతృవంశముల ప్రతిష్ఠ, ధర్మప్రతిష్ఠ శాశ్వతముగా నిలుప వలసినభారము నీపైననే యున్నది. పితృదేవతలతృప్తికొరకు కురువంశసంతతినిగూడ నీవే నిర్విఘ్నముగా నిలుప వలసినవాడవై యున్నావు, నీవు పుణ్యకర్ములు చేసి దీర్ఘాయుష్మంతుడవగునట్లే ధర్మప్రతిష్ఠాపకుడవుగాకూడ ఇప్పుడు కావలసి యున్నది. సర్వవేద శాస్త్రములు, సర్వధర్మములు నీ వెరుగుదువు. నేను నీకు చెప్ప వలసినది లేదు. ఐనను. నే నొకధర్మకార్యమును నీ కాజ్ఞాపించుచున్నాను. అది చేయుము. నీతమ్ములు బాల్యమునందే సంతతిహీనులై గతించిరి, అంబికాంబాలికలకు సంతానాభిలాష కలదు. వారియందు నీవు ధర్మసంతతిని కని వంశక్రమమును నిలబెట్టుము. రాజ్యాభిషేకము చేసికొని ప్రజలను పాలించుము. ధర్మానుసారముగా నీవుగూడ వివాహము చేసికొని పితృదేవతలకు నరకమునుండి విముక్తి కలిగించుము." అని చెప్పెను. మిత్రులు, బంధువులు, అమాత్యులుగూడ ఆమాటకు అనుమతించిరి.

వారిమాటలు విని భీష్ముడు, "తల్లీ ! నీమాటలు ధర్మబద్ధములే యగును. కాని నేను నీవివాహసమయమునందు చేసినప్రతిజ్ఞను తప్పను. పెండ్లిని గాని, పుత్రసంతతిని గాని, రాజ్యాధికారమును గాని నేను కోరను. ఇది నానిశ్చయము, త్రైలోక్యరాజ్యము వచ్చినను సత్యమును తప్పను. భూమి గంధమును, జలము రుచిని, తేజస్సు రూపమును, వాయువు స్పర్శమును, సూర్యుడు తేజస్సును, అగ్ని ఉష్ణత్వమును, ఆకాశము శబ్దమును, చంద్రుడు చల్లదనమును, ఇంద్రుడు పరాక్రమమును, యముడు ధర్మమును విడిచినను విడుతురుగాక ; నేనుమాత్రము ఆడినమాట తప్పను," అని చెప్పెను.

ఆమాటకు సత్యవతి "పుత్రా ! నీవు నాకొరకు చేసిన దృఢప్రతిజ్ఞను, నీధర్మనిష్ఠను, నీసత్యపరత్వమును నే నెరుగుదును. నీవు తలచినచో త్రైలోక్యరాజ్యమునుగూడ తిరిగి సృజించగలవు, కాని, ఇప్పుడు మనవంశమునకు ఆపత్కాలము సంభవించినది, ఆపద్ధర్మముగా నామాటను అంగీకరించుము, నీతండ్రితాతలభారమును వహించ వలసినవాడవు నీవే. వారికి తిలోదకములను, వారివలె ధర్మపాలనమును నీవు, నీ సంతతియు చేయ వలసి యున్నది. దీనివలన అందరు హర్షింతురు." అని యేమియు తోచక విలపించెను.

అప్పుడు భీష్ముడు "తల్లీ ! నీవు ధర్మమును వీడి మాట్లాడుచున్నావు. ఎన్నిసంకటములు వచ్చినను క్షత్రియుడు సత్యము

తప్పగూడదు. కనుక నన్ను నిర్బంధించకుము. శాంతనుని సంతతి యెడతెగక నిలుపుటకు నీ కొకధర్మసూక్ష్మమును తెలిపెదను. అది క్షత్రియులకు అనుసరణీయము. అట్టి ఆపద్ధర్మమును విద్వాంసులతోను, అమాత్యపురోహితులతోను, నీవు యోచించి అంగీకరించుము. దానివలన అందరికి శ్రేయస్సు కలుగును. అది యే మనగా :— "గుణవంతుడు, నియమవంతుడు నైనబ్రాహ్మణుని ద్వారా స్త్రీకోడండ్రయందు సంతానమును బడయుము. ఇది 'నియోగధర్మ' మన బడును. విధవలయందు, ధర్మముకొరకు సంతానోత్పత్తి చేయుటకు నియుక్తు డైనవాడు, శరీరమునకు నేయి పూసికొని, వికారరూపమును కల్పించుకొని, మౌనముతో అస్త్రీయందు ఒక్కకొడుకును మాత్రమే కన వలెను. రెండవకొడుకును కూడదు. ఆ నియోగధర్మము నెరవేరిన తరువాత వారిరువురు మామవలె, కోడలువలె పితృ-పుత్రీభావముతోనే మెలగ వలెను. ఇది నియోగధర్మము. దీనివలన క్షత్రియసంతతి విచ్ఛిన్నము కాదు, ధర్మమునకు భంగము కలుగదు. ఇది గాక మరియొకధర్మసూక్ష్మము గలదు. ఎక్కడగూడ విధి లేనప్పుడు ఒకగుణవంతు డైనబ్రాహ్మణునకు ధన మిచ్చికూడ అతనివలన విచిత్రవీర్యుని క్షేత్రములందు సంతానమును బడయ వచ్చును,'' అని చెప్పెను.

ఆమాటలు విని సత్యవతి కించిత్తు నవ్వి, సిగ్గుపడుచు మెల్లగా తన బాల్యవృత్తాంతమును తెలిపి "తనకు కన్యాత్వము నందు పరాశరమహామునివలన గలిగినవ్యాసునిఉత్పత్తి ని గూర్చి చెప్పెను. అవ్యాసుడు బ్రహ్మర్షిసత్తముడు. నేను తలచినవెంటనే నన్ను దర్శించుటకు వచ్చును. అతనిచేత ఈ ఆపద్ధర్మకార్యమును నిర్వహింపజేసెదను." అని చెప్పెను.

ఆ మాటకు భీష్ముడు, ''తల్లీ ! ధర్మార్థకామములను సేవించు పురుషుడు, ధర్మమువలన-ధర్మము, అర్థమువలన-అర్థము, కామమువలన-కామము-అభివృద్ధి చేయుటకు యోచించు చుండును. ఇది బుద్ధిమంతునిలక్షణము. నీ విపుడు ధర్మమువలన మరియొక ధర్మమును కలిగించి కురువంశమును నిలుప దలచుట యెంతయో శ్రేయస్కరము. మహాయోగ్యు డైన వ్యాసమునికంటె మరి యొకడీ నియోగ' కార్యమునకు అర్హుడు కాడు. కనుక తప్పక నీ వీకార్యమును నెరవేర్చుము. ఇది అందరికి సమ్మతము '' అనెను.

అప్పుడు సత్యవతి వ్యాసుని తలచినవెంటనే ఆమహాను భావుడు ప్రత్యక్షమై తల్లికి అభివాదము చేసెను. సత్యవతి తన కోరిక నతనికి తెలిపెను. అతడు తల్లియాజ్ఞను మీర లేక ధర్మ కార్యమునకు అంగీకరించెను. 'తల్లీ! నాతేజస్సును భరించుట సామాన్యస్త్రీలకు అశక్యము. కనుక వా రొకసంవత్సరము వ్రతాచరణము చేయ వలెను' అని చెప్పెను. ఆమాటకు, 'నాయనా! వంశక్షయ మైనది. భీష్ముడు రాజ్యము నేల నను చున్నాడు. కురువంశోద్ధరణమునకుగాను నీవు సద్యోగర్భముచేత ఇప్పుడే సంతతిని కనుము.' అని సత్యవతి చెప్పెను. అందు కాయన అంగీకరించెను. సత్యవతి అంబికను పిలిచి అనేకధర్మములను ఉపదేశించి ఆ నియోగ కార్యమునకు అంగీకరింప జేసెను. కాని ఆమె వ్యాస మహామునిని చూచినవెంటనే భయపడి అతేజస్సును చూడ లేక కన్నులు మూసికొనెను. వ్యాసు డామెకు గర్భమును ప్రసాదించెను.

'తల్లీ! యీ పుట్టబోవు బాలకుడు సకలధర్మవిదు డగును. కాని అంబిక కన్నులు మూసికొనినందున పుత్రుడు గ్రుడ్డివాడగును, అని వ్యాసుడు చెప్పి, వెడలిపోయెను. తరువాత పుట్టిన బాలకునిచూచి సత్యవతి అంధుడు రాజ్యార్హుడు కాడు. అని రెండవసారి, వ్యాసుని రప్పించి మరియొకపుత్రుని అనుగ్రహింపుము.' అని కోరెను. అందుకు ఆయన అంగీకారమును తీసికొని, చిన్నకోడ లగుఅంబాలికకుగూడ ధర్మబోధ చేసి ఆమెను ఒప్పించెను. ఆమె కన్నులు మూసికొనలేదు, కాని, వ్యాసుని చూచినవెంటనే భయపడి వివర్ణురాలయ్యెను. ఆమె శరీరమంతయు భయముచేత పాలిపోయి తెల్ల బడెను. అందువల్ల ఆమెకు పుట్ట బోవుకొడుకు " పాండు " రోగగ్రస్తు డగును, అతనిపేరుగూడ " పాండు " అని యేర్పడును. అని వ్యాసుడు చెప్పెను. దానికి ఆమె చింతించి, మరియొక సుతుని ప్రసాదింపుమని కోరెను. అతడు తల్లియాజ్ఞను మీర లేక పోయెను. అప్పుడు సత్యవతి అంబికను నియోగించెను, కాని ఆమె అత్త మాటను మనసా అంగీకరించక, ఒంటరిగా తనదాసిని పిలిచి ఆమెకు తనఆభరణము లన్నియు కానుకగా నిచ్చి అలంకరించి వ్యాసునికడకు పంపెను. ఆదాసి వ్యాసునిఅనుగ్రహమును బడసెను. అతడు సంతసించి ఆమెకు నాటినుండి దాసీత్వమునుండి విముక్తి కలుగునట్లు వర మిచ్చి పంపెను. ఆగర్భమునందు మహాధర్మమూర్తి, శాంతుడు నైనవిదురుడు పుట్టెను. ఇట్లు పుత్రులను కనుటను 'దేవరన్యాయము' అనికూడ అందురు. ' దేవర ' అనగా, బావ (మగని సోదరుడు), అతనివలన సంతతిని కనుట యని యర్థము. వ్యాసుడువిచిత్రవీర్యుని భార్యలకు ' దేవరుడు ' కనుక ఈ న్యాయము లోకప్రచారములోనికి వచ్చెను.

కృష్ణద్వైపాయనుడు ' అంబిక మోసము చేసి దాసిని పంపెను. కనుక ఈబాలు డెంతధర్మాత్ము డైనను క్షత్రియుడు కాడు కనుక రాజ్యార్హుడు కాడు. ధర్మదేవతయే అణీమాండవ్యుని శాపముచేత విదురుడుగా పుట్టెను. అని సత్యవతికి చెప్పెను.

## అణీ మాండవ్యుని కథ

ధర్మదేవతకు శాప మెందుకు వచ్చె నని జనమేజయు డడుగగా వైశంపాయనముని యిట్లు చెప్ప దొడగెను:—

పూర్వము 'మాండవ్యుడు' అను మహాధర్మాత్ము డగు బ్రాహ్మణుడు తపోనిష్ఠలో మౌని యై యుండెను. కొందరు దొంగలు ధనమును అపహరించి ఆమునివద్దకు వచ్చి అధనము నచ్చట ఉంచి దాగి యుండిరి. రాజభటులు వచ్చి అది చూచి, 'దొంగ లెక్కడ నున్నారు' అని ఆమునిని అడిగిరి. అతడు మౌనవ్రతములో నుండి వారికి [illegible]పలు చెప్ప లేదు. వారు అక్కడ వెదకి దాగి యున్నచోరులను పట్టుకొని, [illegible]కూడ ఈ దొంగతనములో భాగస్వామి యయి యుండునని అతనినిగూడ దొంగలతోపాటు రాజుకడకు తీసికొని పోయిరి, రాజు తెలియక అందరికిని 'శూలారో

పణ' శిక్ష విధించెను. దొంగలతోపాటు మాండవ్యునిగూడ శూలముపైన రాజభటులు ఎక్కించిరి. శూలము శరీరములో గ్రుచ్చుకొని దొంగలు నశించిరి. కాని మాండవ్యుడుమాత్రము తపశ్శక్తిచేత మరణించక తనలో గ్రుచ్చుకొన్నశూలముపైననే ఉండి నిరాహారుడై తపస్సుచేయు చుండెను కొందరు మునీశ్వరు లతనికడకు వచ్చి 'మహాత్మా! నీ కీయపరాధము నెవరు చేసిరి, అని ప్రశ్నించిరి. మునులారా! ఎవరును నాయెడల దోషము చేయలేదు. నాపురాకృతమును అనుభవించు చున్నాను.' అని మాండవ్యుడు చెప్పెను. ఆ మాటలు విన్నరాజభటులు ఆశ్చర్యపడి రాజునకు ఆయద్భుతమును తెలిపిరి. రాజు విచారపడి ఆమునిని క్షమించు మని వేడుకొని శూలమునుండి దింపెను. ఆయనశరీరములోనుండి శూలమును ఊడ బెరికించెను. కాని శూలాగ్రము ఈవలికి రాలేదు. అది ఆమునిశరీరములోనే యిరికెను. కనుక అతనికి 'అణీమాండవ్యుడు' అని పేరు వచ్చెను. 'అణీ' అనగా శూలాగ్రము. 'అది శరీరములో నున్నమాండవ్యుడు' అని అర్థము.

అణీమాండవ్యుడు విముక్తుడై సర్వలోకములను సంచరించుచు నొకనాడు ధర్మదేవతకడకు బోయి 'నే నేమిదోషము చేసితిని. ఎందు కింతకఠినమైనశిక్షను నాకు విధింప జేసితివి' అని అడిగెను. దానికి ధర్ముడు, 'నీవు బాల్యమునందు తేనెటీగపుచ్చములో సూది గ్రుచ్చినావు. తత్ఫల మిప్పు డనుభవించు చున్నావు' అనెను. దాని కాముని 'పన్నెండువత్సరములవయస్సువరకు బాలుడు చేసినతప్పు అధర్మ మనిపించుకొనదు. నాయపరాధ మల్పమైనను కఠినదండనము విధించితివి, కనుక నీవు శూద్రాయోనియందు మానవుడవుగా పుట్టుము' అని శపించెను.



నేటినుండి లోకములో ధర్మఫల మనుభవించుట కొకవయఃపరిమితిని నిర్ణయించు చున్నాను. బాలురు_పదునాల్గువత్సరముల వయస్సువరకు చేసిన చెడుపనులకు పాప మంటదు. ఆతరువాతనే వారికి పాపకర్మఫలము అంటును అని అణీమాండవ్యుడు పాపఫలానుభవమున కొకగడువు ఏర్పరచెను.

ఆయపరాధముచేత శపింపబడినధర్ముడు విదురుడుగా పుట్టెను. అతడు ధర్మార్థములందు చతురుడు, లోభము, క్రోధము లేనివాడు, శాంతుడు, దూరదృష్టి గలవాడు. కురువంశముయొక్క హితమును కోరు చుండువాడు, అని వైశంపాయనుడు చెప్పెను.

ఆ ముగ్గురుకుమారులజననముచేత కురుజాంగలదేశము, కురువంశము, కురుక్షేత్రము ఈ మూడున్ను సర్వోన్నతికి వచ్చెను. దేశమంతయు సుభిక్షముగ నుండెను. ప్రజలు ఆనంద మనుభవించిరి. భీష్మునియాజ్ఞప్రకారము ధర్మరాజ్యము స్థాపితమయ్యెను. ఆముగ్గురిని భీష్ముడు పుత్రులవలె పెంచెను. వారికి ఉచితములైనఉపనయనాదిసంస్కారములు చేసి భీష్ముడు వారిని సమస్తవిద్యలలోను, ధనుర్వేదములోను విద్వాంసులనుగ జేసెను. పాండువు ధనుర్విద్యలో విశారదు డయ్యెను. ధృతరాష్ట్రుడు అందరికన్నను బలవంతు డయ్యెను. మూడులోకములందును విదురునితో సమానుడైనధర్మాత్ముడు లే కుండెను. నశించినశాంతనునివంశ మీవిధముగా వ్యాసానుగ్రహమున పునరుద్ధరింపబడెను. కాశీరాజపుత్రిక లిరువురును అందరికన్న గొప్పవీరమాతలుగా ప్రసిద్ధి నందిరి. అంధు డగుటచేత ధృతరాష్ట్రుడు, దాసిపుత్రుడగుట చేత విదురుడు రాజ్యాధికారమునకు అర్హులు కాలేదు. పాండురాజు కురురాజ్యమునకు రాజయ్యెను.

కుమారులు యౌవనవంతు లగుటను చూచి భీష్ముడు విదురునితో సంప్రతించి ధృతరాష్ట్రపాండురాజులకు వివాహము చేయ సంకల్పించెను. "మాకు తల్లి దండ్రులు మీరే. మీ యాజ్ఞకు వ్యతిరేకము ఉండదు'' అని విదురుడు చెప్పెను.

సుబలరాజుపుత్రి యైనగాంధారికి నూరుగురు కొడుకులు గలుగుదు రని బ్రాహ్మణులవలన భీష్ముడు విని, కురువంశములో విశాలమైనసంతతిని సంపాదించుటకు ఇది మంచితరుణ మని తలచి ధృతరాష్ట్రునకుగాంధారి నిచ్చి వివాహము చేయవలసిన దని గాంధారరాజునకు వర్తమానము నంపెను. అతడు 'ధృతరాష్ట్రుడు అంధు' డని విని కొంత విచారించెను. కాని, అతనికులమును, శీలమును, వంశవిఖ్యాతిని గమనించి గ్రుడ్డివానికి తనకూతురును ఇచ్చుటకు నిశ్చయించెను. 'అంధునకు తనను ఇచ్చి పెండ్లి చేయుటకు తల్లిదండ్రులు నిశ్చయించినా రని తెలిసి గాంధారి పిత్రాజ్ఞకు బద్ధురాలై ఆవివాహమునకు అంగీకరించెను. ధర్మపరురాలు గనుక' పతిదేవు డంధు డయినప్పుడు తాను దృష్టి గలిగి యుండుట పాతివ్రత్యధర్మమునకు భంగ మని యామె తన రెండు కన్నులు కనపడకుండ బట్టతో కట్టుకొనెను. భర్త గ్రుడ్డివాడని తానెప్పుడుగూడ అతనినిగూర్చి యేవగించుకొననని కూడ నిశ్చయించుకొనెను. తరువాత ఆమెసోదరుడు శకుని ఆమెను తోడుకొని పోయి భీష్మునియనుమతిచేత ధృతరాష్ట్రున కిచ్చి వివాహము

చెసెను. నాటినుండి ఆమె సుశీల యై కురువంశమువారికి అత్యంత ప్రియురాలుగా నుండి అందరిమెప్పు వడసెను.

వసుదేవునితండ్రి యగుశూరు డనువానికి పృథ యను కూతు రుండెను. అతనిమేనత్త కొడుకగు కుంతిభోజుడు సంతాన హీనుడుగా నుండి, వేడుకొనగా శూరుడు పృథను అతనికి దత్తపుత్రిగా నిచ్చెను. నాటినుండి ఆమె కుంతిభోజునకు కూతురై 'కుంతి' అను పేరుతో వ్యవహరింప బడెను.

ఒకనాడు కుంతిభోజునింటికి దూర్వాసు డనుమహాముని అతిథిగా వచ్చెను. ఆయనను సత్కరించి కుంతిభోజుడు ఆయనసేవార్థమై కుంతిని నియమించెను. ఉగ్రకోపను డైనఆమునిని కుంతి మిక్కిలిశ్రద్ధాసక్తులతో సేవించి యతనియనుగ్రహమునకు పాత్రురా లయ్యెను. ఆయన అనుగ్రహించి యిచ్చినమంత్రమును ఆమె జపించు చుండెను. ఆమె ఆ మంత్రమును పఠించి దేవతలలో నెవని నాహ్వానించినను వచ్చి ఉపధర్మములో ఆమెకు పుత్రుని ప్రసాదించి పోగలడు. దానివలన ఆమెకు పాతివ్రత్యభంగము కలుగదు.

దూర్వాసుని వరమునకు సంతసించి కుంతి దానిని పరీక్షించుటకు కుతూహలము కలదై మంత్రోచ్చారణ చేసి సూర్యు నాహ్వానించెను. సూర్యుడు వచ్చి సంతోషించి యామెకు గర్భమును ప్రసాదించి, దానివలన ఆమెకన్యాత్వమునకు భంగము రాదని చెప్పి అంతర్ధానము చెందెను. ఆమె తనబంధువులకు భయపడి ఆశిశువును నదిలో విడిచెను. ఆ శిశువునకు సహజము లైనకవచకుండలము లుండెను.

జలప్రవాహములో కొట్టుకొని పోవు చుండినఆశిశువును సూతుడు తీసికొని పోయి తనభార్య, రాధ కిచ్చెను. వారు అనపత్యు లగుటచేత ఆ శిశువును పెంచుకొని అతడు వసువు (ధనము—కవచకుండలములు)తో లభించినవాడు గనుక అతనికి 'వసుషేణుడు' అని నామకరణము చేసిరి. అతడు పెరిగి బలవంతుడై ప్రతిదినము సూర్యారాధనము చేయు చుండెను. జపము చేయుచు న్నప్పు డతనిని ఎవ రేది కోరినను ఇచ్చు చుండెను. అట్టిదానగుణ మాతనికి జీవితమంతయు ఉండెను. 'దానకర్ణుడు' అను ప్రఖ్యాతిగూడ అజరామరముగా నతనికి దానివలన ప్రపంచములో నిలిచిపోయెను.

ఒకనాడు ఇంద్రుడు బ్రాహ్మణవేషముతో నతనికడకు భిక్షార్థి యై వచ్చి యతనిసహజకవచకుండలములను యాచించెను. అతడు శరీరమునకు అంటుకొని యున్నకవచమును కుండలములను ఊడబెరికి ఇచ్చెను. అతనిదానవీరత్వము చూచి యింద్రుడు ఆశ్చర్యపడి సంతోషముతో ''నీవంటివదాన్యుడు మూడులోకములలో నెక్కడను లేడు. నేను చాల సంతసించితిని. వరము కోరుకొనుము.'' అనెను. దానికి వసుషేణుడు దోసిలి యొగ్గి 'త్రిలోకాధిపతి యైననిన్ను సంతృప్తి పరచ గలిగిననేను చాల ధన్యుడను. నేను ఇచ్చుదానమును నీవు స్వీకరించుటయే నా కొక గొప్ప అయినను, వరము కోరుకొను మను చుంటివి. కనుక 'శత్రుసంహారమునందు అమోఘ మైనశక్తియాయుధమును నాకు ప్రసాదింపుము' అని యడిగెను. ఇంద్రుడు సంతసించి 'శక్తి' ఆయుధమును ఇచ్చి 'మూడులోకములలో నెంతపరాక్రమశాలినైనను ఒకనిని దీనితో నీవు హత మార్చగలవు.' అని చెప్పి వెడలిపోయెను. వసుషేణుడు తనశరీరమునుండి కవచకుండలములను ఒలిచి యిచ్చెను గనుక నాటినుండి అతనికి 'కర్ణుడు' అనియు, సూర్యసుతు డగుటచేత 'వైకర్తనుడు' అనియు ప్రసిద్ధ నామములు ఏర్పడెను.

## పాండురాజు వివాహము.

కుంతిభోజుడు కుంతికి స్వయంవరము ప్రకటించెను. కుంతీదేవి రాజపుత్రులలో నధికతేజశ్శాలి యైనపాండురాజు కంఠమునందు పూలమాల వేసి అతనిని వరించెను. కుంతిభోజుడు వివాహము చేసి వారిని హస్తిపురికి పంపెను.



తరువాత భీష్ముడు పాండురాజునకు మరియొకవివాహము చేయ తలపెట్టి అమాత్య పురోహితుల సమ్మతిపైన వారితో పాటు మద్రదేశాధిపతి యైన "వాహీకుని (శల్యుడు) రాజధానికి పోయి యతని చెల్లెలు మాద్రిని తన తమ్మునకు నిమ్మని కోరెను. శల్యుడు మిక్కిలి సంతోషపడి తనవంశమర్యాదప్రకారము 'కన్యాశుల్కము' నిచ్చి పెండ్లి చేసికొను మని భీష్మునకు చెప్పెను. భీష్ముడు ఆవంశమర్యాదను ఆదరించి బంగారము, రత్నములు, గజాశ్వములు కన్యాశుల్కముగా శల్యున కిచ్చి మాద్రిని తోడుకొని పోయి హస్తినాపురములో నిరువురికిని పెండ్లి చేసెను. శల్యుడు, మాద్రిని సాలంకృతముగా పాండువుకు కన్యాదానము చేసెను.

పాండురాజు ఇరువురుభార్యలతో ముప్పదిదినములు కామోపభోగములను అనుభవించి దిగ్విజయయాత్రకై బయలు

దేరెను. సమస్తదిక్కుల యందు జయమును సాధించెను, రాజులు సమర్పించిన కప్పములను తీసికొనెను. ఆయాదేశపు సైన్యములను రాజులను వెంటబెట్టుకొని హస్తిపురికి వచ్చెను. భీష్మాదులకు నమస్కరించెను, గెలిచినధనరాసులతో ధృతరాష్ట్రుడు నూరు అశ్వమేధయాగములను చేసెను. ఈ విధముగా పాండురాజు దిగ్విజయము చేసి బంధువులను ప్రజలను సంతోషపరచెను.

తరువాత పాండురాజు, భార్యల ప్రోత్సాహముచేత రాజభవనమును వీడి భార్యలతో వనమునకు పోయి, మృగయారతుడై అచ్చటనే నివసించు చుండెను. వారికి కావలసినవస్తుసామగ్రిని ధృతరాష్ట్రుడు వనమునకు పంపు చుండెను.

దేవకుడు అను రాజువద్దనున్న ఒక బ్రాహ్మణునకు దాసివలన కలిగిన ఒకకన్యకను తెచ్చి భీష్ముడు విదురునకు వివాహము చేసెను. ధర్మాత్ముడైనవిదురుడు ఆస్త్రీయందు ధర్మపరులైన అనేకపుత్రులను కనెను.

## దుర్యోధనాదుల ఉత్పత్తి

వ్యాసమహాముని ఒకప్పుడు ఆకలిచేతను, శ్రమచేతను బాధపడుచు ధృతరాష్ట్రునియింటికి వచ్చెను. గాంధారి ఆమహామునికి తృప్తిగా మిష్టాన్నమును బెట్టి పూర్తి విశ్రాంతి గలిగించెను. ఆ ముని సంతుష్టుడై ఆమెకు వర మీయ దలచెను. గాంధారి తనపతితో సమాను లగునూర్గురుపుత్రులను కోరెను. అతడు వరమును అనుగ్రహించెను.

కొంతకాలమునకు గాంధారి గర్భవతియై ఆగర్భమును రెండేండ్లు ధరించెను. కాని ప్రసవము కాలేదు. ఈ కాలములోనే కుంతికి చక్కనికొడుకు పుట్టగా గాంధారి దుఃఖపడెను. తన గర్భము ఫలించనందుకు చింతిల్లెను. ధృతరాష్ట్రునకు తెలియకుండ ఆమె తనగర్భముపైన దెబ్బలు కొట్టుకొనెను, దానివలన గర్భమునుండి యినుమువలె కఠిన మైనయొకమాంసపిండము ఉత్పన్నమయ్యెను. అది రెండేడ్లు తనగర్భములో నున్నప్పటికిని మెత్తబడలేదని గాంధారి దానిని పారవేయ దలచెను. అప్పుడు వ్యాసుడు వచ్చి వారించి, 'ఎందుకు దీనిని పార వేయుచున్నా వని యడిగెను. ఆమె తనకు గలిగినవిసుగును, తోడికోడలికి గలిగిన పుత్రప్రాప్తిచేత ఏర్పడిన అసూయను వ్యాసునకు తెలిపి, 'అందుచేత దీనిని పార వేయుచున్నా'ననెను. వ్యాసుడు విని 'అట్లు చేయకుము, వెంటనే నూరు నేతికుండలను తెప్పించి వాటిని రహస్యముగా జాగ్రత్త పరచి యుంచుము. ఈ మాంసపిండిమును చల్ల నీరుతో తడుపు చుండుము" అని చెప్పెను. ఇట్లు తడుపు చుండగా ఆమాంసపిండము పగిలి నూట ఒక్కశకలము లయ్యెను. ఒక్కొక్క శకలము, బొటనవ్రేలిగెణుపుప్రమాణములో నుండెను. ఒక్కొక్కశకలము ఒక్కొక్కనేతికుండలో వేసి మూసి ఉంచి జాగ్రత్తతో రహస్యముగా కాపాడు చుండెను. అప్పుడు వ్యాసుడు, 'ఈ కుండల నిట్లే రెండేండ్లవరకు కాపాడి తరువాత వాటిపైన మూతలను తీసి వేయుము, అని చెప్పి హిమాలయముపై తపస్సు చేసికొనుటకు వెడలిపోయెను.

రెండువత్సరములు గడచిన తరువాత మొదటికుండ నుండి దుర్యోధనుడు పుట్టెను. పుట్టగనే అతడు గార్దభస్వరముతో నేడ్చుచుండెను. దానికి ప్రతిధ్వనిగా ఊరిలోని గాడిదలు, గద్దలు, కాకులు, నక్కలు అరచెను. సుడిగాలులు, మంటలు దిక్కులందు కలిగెను. అది విని ధృతరాష్ట్రుడు భీష్మాదులను, పౌరులను పిలిచి, 'గుణసంపన్నుడైన యుధిష్ఠిరుడు వంశములో జ్యేష్ఠకుమారుడు. అతడు రాజ్యమునకు అర్హుడయ్యెను. నాకు గలిగిన జ్యేష్ఠపుత్రునకు రాజ్యమేలుఅధికారము వచ్చునా? మీ రందరు యోచించి స్పష్టముగా చెప్పుడు" అని అడిగెను. వెంటనే నలుదిక్కులందు, సింహవ్యాఘ్రాదులు, నక్కలు, అశుభసూచకముగా అరచెను. అది విని, విదురుడు బ్రాహ్మణులు, ధృతరాష్ట్రునితో. 'రాజా! ఇతని జన్మమునందు కలిగిన అశుభధ్వనులు అపశకునమును సూచించు చున్నవి. ఇతనివలన కురువంశమునకు నాశము ప్రాప్తించును. ఇతనిని నీ విప్పుడే విడిచినచో ఆనాశము కలుగదు. పుత్రప్రేమచేత విడువకున్నచో స్వకులనాశమునకు దారి తీసినవాడ వగుదువు. వంశక్షేమమును దృష్టియం దుంచుకొని నీవు తక్కిన తొంబదితొమ్మిదిమందిని రక్షించి యితని నొక్కని విడువుము. నూర్గురిలో ఒక్కని విడుచుటచేత నీకులమునకేకాక జగత్తుకే క్షేమము కలుగును. 'కులమును రక్షించుటకు ఒకవ్యక్తిని, గ్రామరక్షణకుగాను ఒకవంశమును. దేశరక్షణకై ఒకగ్రామమును, ఆత్మరక్షణార్థమై సర్వజగత్తును విడుచుట ధర్మము. అని ధర్మశాస్త్రములు చెప్పుచున్నవి.'' అని విదురుడు మొదలైనపెద్దలు చెప్పినమాటలను ధృతరాష్ట్రుడు పుత్రప్రేమచేత చెడచెవిని బెట్టి ఆదరించ లేదు.

ఈ విధముగా అన్నినేతికుండలనుండి క్రమముగా ఒక్కొక్క కొడుకుగా గాంధారికి నూర్గురుకొడుకులు కలిగిరి. ఆతర్వాత ఒక నెలకు ఒక కన్యకగూడ పుట్టెను. నూర్గురుపుత్రుల గర్భభారమును వహించుటచేత గాంధారి కడుపు పెరిగి బాధపడు చుండెను. ఆ దినములలోనే ధృతరాష్ట్రునకు వేశ్యాస్త్రీయందు ఒక కొడుకు పుట్టెను. అతనిపేరు ''యుయుత్సుడు.'' అతడు 'కరణ' జాతివాడని పిలువ బడు చుండెను. అతడు మహాతేజస్వి. పరాక్రమ వంతుడయ్యెను. ఈ విధముగా ధృతరాష్ట్రునకు నూట యిద్దరు సంతానము కలిగిరి.

''గాంధారికి నూర్గురు పుత్రులేకదా వ్యాసు డనుగ్రహించెను. కూతు రెట్లు కలిగెను?" అనుప్రశ్నమునకు సమాధానముగా వైశంపాయను డిట్లు చెప్పెను.

'జనమేజయా! నూరుఘృతకలశములనుండి పుత్రులు పుట్టుచున్నప్పుడు తనకు కూతురుగూడ కలుగవలెనను ఆశ గాంధారికి జనించెను. కూతురు, అల్లుడు, దౌహిత్రులు నన్నచో స్త్రీలకు ప్రీతి యెక్కువ. అది కనిపెట్టి వ్యాసుడు, నూటఒక్క శకలములుగా పగిలినమాంసపిండములో నూరు పోగా మిగిలిన కన్యాభాగ మగు నొక్కశకలమును మరియొకనేతికుండలో వేయించెను. దాని నుండి కన్యక పుట్టెను. ఆమెపేరు దుశ్శల. ఆమెను తర్వాత జయద్రథున (సైంధవున) కిచ్చి వివాహముచేసిరి. ఇది ధృతరాష్ట్రుని

సంతతిక్రమము, అతనినూర్గురుపుత్రులపేర్లుగూడ వరుసగా దుర్యోధనాదిక్రమమున నేర్పబడెను.

## పాండురాజుకు శాపము.

పాండురాజు భార్యలతో వనములోఉండి అచ్చట వేటాడుచు ఆనందముగా కాలము గడపు చుండెను. ఒకనా డతడు స్త్రీ పురుష మృగములు కలిసి యుండగా వాటిని బాణముతో కొట్టెను. మగలేడి ఆ దెబ్బచే చచ్చుచు ఆ మహారాజును నిందించెను. అతడు,



"మృగములు ఎట్టి పరిస్థితిలో నున్నను వేటాడుట రాజధర్మము. పూర్వము అగస్త్య మహాముని ఒకవనములో సత్రయాగము చేయుచు, యజ్ఞమునకు విఘ్నములు కల్పించు చున్నమృగములను రాజులచే వేటాడించి నిర్విఘ్నముగా యజ్ఞసమాప్తి చేసెను. తరువాత ఆమహాముని మృగములు ఎట్టిఅవస్థలోనున్నను రాజులు వేటాడవచ్చును' అని ఒక ధర్మమును లోకములో ప్రవేశపెట్టెను.'' అని ఆమృగముతో చెప్పెను. ఆమృగము, మృగరూపములో నున్న 'కిందముడు' అనుమహర్షి. అతడు మనుష్యరూపములో స్త్రీని కలియుటకు లజ్జించి తాను తనస్త్రీయు మృగరూపములను ధరించి ఆయడవిలో విహరించు చుండిరి. 'ఈ విషయ మామృగరూపధరుడై నకిందమముని చెప్పి, 'రాజా! నేను ముని నని తెలియక నీవు నన్ను చంపితివి కనుక, నీకు బ్రహ్మహత్యాదోషము అంటదు. కాని సంగమసుఖము ననుభవించు చున్న ప్రాణిని చంపుట మహాపాపము. ఆపాపఫలముగా నీవు స్త్రీని కలిసినచో మరణింతు వని శాప మిచ్చి కిందముడు మరణించెను.

పాండురాజు శాపతప్తుడై వైరాగ్యముచేత తనవస్త్ర భూష ణాదు లన్నియు బ్రాహ్మణులకు దానముచేసి కుంతీమాద్రులతో 'శతశృంగము' అనుపర్వతముపైకి పోయి తపస్సు చేసి కొను చుండెను. బ్రాహ్మణులు పోయి ఆవృత్తాంతమును హస్తి



పురిలో తెలిపిరి. శతశృంగమునందలియితరమును లందరును పాండురాజుకు చాల ఆప్తులుగా నుండిరి.

ఒకనా డచ్చటిమును లెల్లరు బ్రహ్మలోకమునకు పోవ దల చిరి. వారితోపాటు పాండురాజుగూడ భార్యలతో పోవుటకు ప్రయాణమయ్యెను. కొంతదూరము పోయినతరువాత ఆ మునులు పాండురాజుతో, "రాజా! ఈమార్గములో వెడలుట చాల కష్టము. అనేకమృగములు బాధించును. ఇంతియే కాక, నిరాహారులై వాయువుగూడ దూర జాలనిగుహలద్వారా వెడల వలెను. ఆ మార్గములో కేవలము పరమయోగీంద్రులు అంత ర్ముఖులు మాత్రము పోవ జాలుదురు. కనుక సుకుమారులైన యీస్త్రీలు రా లేరు. పుత్రహీనులైనమానవులకు స్వర్గద్వారము బంధింప బడును. దానిని దాటియే సత్యలోకమును చేర వలెను." అని చెప్పిరి.

ఆమాటలు విని నిరుత్సాహపడి పాండురాజు ప్రయాణమును విరమించుకొని రహస్యముగా కుంతితో నిట్లనెను:- 'సంతతిహీను లకు దుర్గతియే కలుగును. మానవుడు పుట్టుకతోడనే, 'పితృ ఋణము, దేవఋణము, ఋషిఋణము, మనుష్యఋణము' అను నాల్గుఋణములు కలవా డగును, పుత్రోత్పాదనముచే, శ్రాద్ధాది కర్మలచే పితృఋణమునుండి, యజ్ఞములు, హోమములు చేసి దేవఋణమునుండి, వేదాధ్యయనముచే, తపస్సులచే ఋషి ఋణమునుండి, ఇతరులయెడ దయ, సానుభూతి, అహింస మొద లగుగుణములతో ప్రవర్తించి మనుష్యఋణమునుండియు మానవులు విముక్తులగుదురు. నేను 'కిందమ' మునిశాపముచేత పుత్రోత్పత్తి చేయుటకు అనర్హుడను-ఏమిచేయుటకును తోచకున్నది పుత్రులు పన్నెండువిధములుగ నుందురు. ఆర్గురు బంధు దాయాదులు, ఆర్గురు అబంధుదాయాదులు. బంధుదాయాదు-లనగా, ఆత్మబంధువులు, పితృబంధువులు, మాతృబంధువులుగా నుండి తనఆస్తికి ఉత్తరాధికారులుగా నుందువా రని అర్థము. పైమూడు బంధుత్వములు లేకున్నను ఉత్తరాధికారము గలవారు అబంధు దాయాదు లన బడుదురు.

బంధుదాయాదులలో 1. 'స్వయంజాతుడు' (తాను పెండ్లి యాడినస్త్రీకి తననుండి పుట్టినకొడుకు), 2. 'ప్రణీతుడు' (తనభార్యగర్భమునుండే మరియొక ఉత్తమపురుషునిఅనుగ్రహ ముచేత పుట్టినవాడు.) 3. 'పుత్రికాపుత్రుడు' (దౌహిత్రుడు-కూతుకొడుకు), 4. 'పునర్భవుడు' (రెండవసారి వివాహము చేసికొనినస్త్రీనుండి తనకు పుట్టినవాడు), 5. 'కానీనుడు' (స్త్రీ అవివాహితగా నున్నప్పుడు తనకు గలిగినపుత్రుడు), 6. 'భాగినే యుడు' (సోదరీ పుత్రుడు-మేనల్లుడు). ఈయార్గురు బంధు దాయాదులు.

ఇక అబంధుదాయాదు లెవ రనగా, 1. 'దత్తుడు' (పిల్ల వానితల్లిదండ్రులచేత ఇష్టపూర్తిగా తనకు ఇవ్వ బడినవాడు, 2. 'క్రీతుడు' (ధనాదులను ఇచ్చి వెలకు కొన బడినవాడు, 3. 'కృత్రిముడు, (స్వయముగా తనవద్దికి వచ్చి 'నేను నీకు పుత్రుడనుగా ఉండెదను' అని చెప్పువాడు.) 4. 'సహోఢుడు'(కన్యా వస్థలోనే తననుండి గర్భము ధరించినయామెను తాను పెండ్లి యాడినతరువాత ఆమెకు పుట్టినకొడుకు), 5. 'జ్ఞాతిరేతస్కుడు' (తనగోత్రములో పుట్టినవాడు), 6. 'హీనయోనిధృతుడు' (తనకన్న హీనజాతి స్త్రీయందు తనకు పుట్టినకొడుకు).

ఈ పన్నెండుగురిలో క్రమముగా ఒకనితరువాత నొకరు ఉత్తమ పుత్రు లన బడుదురు, అనగా మొదటివాని అభావమునందు రెండవవాడు, ఇట్లే మూడవ నాల్గవ వారలు ఉత్తములు అని భావము-ఆపత్కాలమునందు నీచజాతిపురుషుడు తనస్త్రీయందు శ్రేష్ఠజాతిపురుషునినుండికూడ సంతతిని బడయుట ధర్మయుక్తమే యగును.

కనుక కుంతీ! తననుండి కాకున్నను, ఇతరశ్రేష్ఠ పురుషునివలన తనస్త్రీయందు ఆపత్కాలమున అపుత్రుని గనుట ధర్మయుక్తము. ఈధర్మము స్వాయంభువమనువు చెప్పినాడు. కనుక నేను స్వయముగా సంతానోత్పత్తి చేయుట నాకు వినాశక రము. కనుక, ఇట్టియాపత్కాలమునందు నిన్ను నాసమానునికడకు గాని, నాకన్న శ్రేష్ఠపురుషునికడకు గాని పంపెదను. పుత్రుని కనుటకు అంగీకరించుము. అట్టిసుతుడు 'ప్రణీతుడు' అన బడును. అతడు ఔరసునితరవాత రెండవస్థానము కలవాడు. అని పాండురాజు కుంతీదేవితో చెప్పెను.

ఆమె 'నేను పతివ్రతను. నిన్నుదప్ప ఇతరుని కామించను. కనుక దీని కొకయుపాయము చెప్పెదను వినుము.' అని యీ క్రింది కథ చెప్పెను:—

పూర్వము 'వ్యుషితాశ్వుడు' అనునొకమహారాజు ఉండెను. అతడు అనేకయజ్ఞములు చేసి దేవతలను తృప్తిపరచెను. ప్రజలను కన్నబిడ్డలవలె పాలించు చుండెను. అతనిభార్య 'భద్ర' యనునామె అతి సౌందర్యవతిగా నుండెను. ఆమె కక్షీ వంతునికూతురు. భార్యాభర్తలకు పరస్పరము అనురాగము అధికముగా నుండెను. ఆమెయందలిఅతిప్రేమచేత వ్యుషితా శ్వుడు సర్వదా ఆమెతో విహరించు చుండెను. దానివలన అతనికి క్షయవ్యాధి వచ్చి చచ్చెను. భద్ర, పతిశవము పైనపడి పలువిధము లుగా ఏడ్చుచుండెను. వారికి సంతతి లేదు. 'సంతానహీనరాల నైనే నీలోకమున జీవించి, అందరిచేత నిరసించ బడుచు నొకక్షణ మైనను ఉండ లేను. కనుక నేను సహగమనము చేసి పరలో కములో నీతో సుఖము ననుభవించు చుండెదను.' అని పరిపరి విధములుగ విలపించు చుండునామెకు ఆశవమునుండి అశరీర వాణివలె ఈలాగు ఒకపలుకు వినబడెను:—

'ప్రియే! విచారించకుము. నీవు ఋతుస్నానము చేసిన తరువాత ఎనిమిదవరాత్రిగాని, పదునాల్గవరాత్రిగాని నీతో కలిసి నీకు పుత్రసంతతిని ఇచ్చెదను.' అనునా పలుకు విని భద్రసంత సించి ఇంటికి పోయెను. ఆవిధముగానే ఆమెకు సంతతి కలిగి సుఖముగ నుండెను.

కనుక రాజా! నీవు స్త్రీసంగముచేత చనిపోయినను, వ్యుషితాశ్వునివలె యోగబలముచేత నీవు నాకడకు వచ్చి సంతతిని కన వచ్చు నని చెప్పెను. (సశేషము.)

# వార్తా చిత్రాలు





ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ పట్టం ఎ. థానుపిళ్ళె నవంబరు 18 వ తేదీన మహబూబునగర్‌లోని జిల్లా పరిషత్ కార్యాలయంలో జిల్లా పరిషత్, పంచాయతీ సమితుల సభ్యులను ఉద్దేశించి ప్రసంగిస్తున్న దృశ్యం.



బేగంపేట విమానాశ్రయంలో నవంబరు 11 వ తేదీన కేంద్ర రేడియో, సమాచార శాఖా మంత్రి శ్రీ రాజబహాదూర్‌కు రాష్ట్ర కార్మిక, రవాణా, సమాచార శాఖా మంత్రి. శ్రీ బి. వి. గురుమూర్తి స్వాగతం చెప్పుతున్న చిత్రం.



కేంద్ర ఆరోగ్య, కుటుంబ నియంత్రణ శాఖా మంత్రి బి. ఎస్. మూర్తి హైదరాబాదులో డిశంబరు 5 వ తేదీన కుటుంబ నియంత్రణ పక్షోత్సవానికి ప్రారంభోత్సవం జరిపారు.



ఎం. ఎం. జి. కె. ఏరియా కమాండర్ మేజర్ జనరల్ సాథే (మధ్యనున్నవారు). ఆర్టిలరీ డైరెక్టర్ మేజర్ జనరల్ ఎ. ఏస్. నర్వేన్ గార్లతో భారత సైనిక దళాల ప్రధానధిపతి (కుడినుంచి మొదటి వారు)



నవంబరు 26 వ తేదీన గోలుకొండవద్ద తన గౌరవార్థం జరిగిన పెరేడులో సైనికవందనం స్వీకరిస్తున్న భారత సైనిక దళాల ప్రధానాధిపతి. మూడు రోజులపాటు జరిగే ఆర్టిలరీ రిజిమెంటు పునర్విలీనీకరణ ఉత్సవాల్లో ఈ పెరేడు ఒక భాగం.



యునిసెఫ్ ఎగ్జిక్యూటివ్ డైరెక్టరు హెన్రీ ఆర్. లబౌస్సీ నవంబరు 16 వ తేదీన ముఖ్యమంత్రిని కలిసినప్పటి చిత్రం.



ఆంధ్రప్రదేశ్ విభాగానికి చెందిన ఇండియన్ రెడ్‌క్రాస్ సొసైటీ నిర్వహిస్తున్న రాఫిల్ ఫండ్ డ్రా లక్కీ టిక్కెట్లను కలుపుతున్న విధానసభ స్పీకరు శ్రీ బి. వి. సుబ్బారెడ్డి. నవంబరు 3 వ తేదీన జూబ్లీ హాలులో జరిగిన ఈ డ్రాకు ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి శ్రీ కె. ఎన్. అనంతరామన్ ఐ. సి. ఎస్., అధ్యక్షత వహించారు.



ఎగ్జిబిషన్ గ్రౌండ్స్‌లో నవంబరు 14 న బాలల దినోత్సవ వేడుకల సందర్భంగా ఏర్పాటైన సభలో ప్రసంగిస్తున్న ముఖ్య మంత్రి.



ముఖ్యమంత్రి ప్రసంగాన్ని శ్రద్ధగా ఆలకిస్తున్న కొంతమంది పిల్లలు.



హైదరాబాదులోని గృహ విజ్ఞాన శాస్త్ర కళాశాలలో హోం సైన్సు క్లబ్బుకు, స్టూడెంట్స్ యూనియన్‌కు నవంబరు 24 న ప్రారంభోత్సవం జరుపుతున్న ఆర్థిక, పరిశ్రమల శాఖా మంత్రి డా. ఎం. చెన్నారెడ్డి ఈ సందర్భంలో ఏర్పాటైన సభకు వ్యవసాయ కళాశాల ఉపాధ్యక్షుడు శ్రీ ఓ. పుల్లారెడ్డి అధ్యక్షత వహించారు.



ఆ సభలో కొందరు శ్రోతలు.



ఇథోపియా ఉపమంత్రి, సహాయక మంత్రులు నవంబరు 16 న జూబ్లీ హాలులో ముఖ్యమంత్రిని కలుసుకున్నప్పటి చిత్రం.



హైదరాబాదు పశ్చిమ తాలూకా జన్‌వాడలో నవంబరు 28 న రక్షిత మంచినీటి సరఫరా పథకానికి ప్రారంభోత్సవం జరుపుతున్న ఆహార, వ్యవసాయ శాఖా మంత్రి శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి.



హైదరాబాదులోని ప్రభుత్వ పాలిటెక్నిక్ కళాశాలలో ఎంప్లాయ్‌మెంటు అధికారులు, పారిశ్రామిక శిక్షణ సంస్థల ప్రిన్స్‌పాల్‌ల సమావేశానికి కార్మిక, రవాణా, సమాచార శాఖామంత్రి శ్రీ వి. వి. గురుమూర్తి నవంబరు 26 న ప్రారంభోత్సవం చేశారు. ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి శ్రీ కె. ఎన్. అనంతరామన్, ఐ.సి.ఎస్. అధ్యక్షత వహించారు.



ఆంధ్రప్రదేశ్ క్రికెట్ అసోసియేషన్ అధికారులతో దేశంలో పర్యటిస్తున్న వెస్ ఇండీస్ క్రికెట్ బృందం ఇండియన్ యూనివర్సిటీ బృందం.





ఏలూరులోని నాట్య నికేతన్‌కు సంబంధించిన నాట్యాచార్య శ్రీ కోరాడ నరసింహారావు నాయకత్వం క్రింద సాంస్కృతిక బృందం ఒకటి ఇటీవల ప్రభుత్వం ఆధ్వర్యంలో పశ్చిమ రంగంలోని అగ్రస్థావరాలలో పర్యటించింది.



ఒక అగ్రస్థావరంలోని సైనికులతో కళాకారుల బృందం.



ఈ బృందం అగ్రస్థావరాలలో చలి, హిమపాతం వంటి అనేక అడ్డంకులను ఎదుర్కోవలసి వచ్చింది.



కొత్తగూడెం విద్యుత్కేంద్రంలో చల్లబరిచే గోపురాలు.



భూలోక స్వర్గంగా విలసిల్లిన శ్రీరంగం.

శ్రీరంగం దేవాలయం మరొక దృశ్యం.





బంగారు విమానం



శ్రీరంగం దేవాలయంలో రాతిపై చెక్కిన శిల్పకళాశోభ.





వెయ్యి స్థంబాల మండపములో రాతిపై చెక్కబడిన నాట్యభంగిమలు.



శ్రీరంగం విలాస మండపం.

# వినియోగదారుల కలలు పండినపంట

# 'కల్పలత'

ధరలపెరుగుదలకు అరికట్టి, నిత్యజీవితావసర వస్తువులను సరసమైన ధరలకు వినియోగదారులకు అందజేయడానికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అనేక చర్యలను తీసుకోవాలని ఆలోచిస్తున్నాయి.

పెద్ద పెద్ద పట్టణాలలో డిపార్టుమెంటల్ స్టోర్స్‌లను, వినియోగదారుల సహకార సంఘాలను ఏర్పాటు చేయడం యీ కృషిలో ప్రధానమైన చర్య.

'కల్పలత' సూపర్ బజారు ఈ లక్ష్యంతో ఏర్పాటుచేయబడింది. విశాల హైదరాబాదులోని వినియోగదారుల అవసరాలను తీర్చే కామధేనువు యిది. నాంపల్లిస్టేషనురోడ్డులో, అబిద్ సర్కిలుకు దగ్గర్లో చక్కటి రెండంతస్తుల భవనంలో ఈ స్టోరు ఏర్పాటు చేయబడింది. ఆధునిక డిపార్టుమెంటల్ స్టోర్స్‌కు కావలసిన అన్ని హంగులూ దీనికి వున్నాయి. 25,000 చ.అ. విస్తీర్ణంలో గల ఈ స్టోరులో విశాలమైన గదులు వున్నాయి. ఈ భవనానికి చుట్టూ విశాలమైన ఖాళీప్రదేశాలు, లాన్‌లు వున్నాయి. ఈ డిపార్టుమెంటల్ స్టోర్స్‌కు భారత ప్రభుత్వం ఆర్థికసహాయాన్ని అందజేస్తున్నది.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆహార, వ్యవసాయశాఖ సంయుక్త కార్యదర్శి శ్రీ సి.ఎన్.శాస్త్రి, ఐ.ఎ.ఎస్. అధ్యక్షులుగా మేనేజింగ్ కమిటీ ఒకటి ఏర్పాటుచేయబడింది.

కల్పలతలో ఈ విభాగాలు ఉన్నాయి.—

1. సరుకులు 2. కాయగూరలు, పండ్లు, గ్రుడ్లు.

3. మందులు, సుగంధద్రవ్యాలు, అలంకరణసామాగ్రి.

4. వస్త్రాలు, రడీమేడ్ దుస్తులు 5. సాధారణ వస్తు సామాగ్రి గృహోపకరణాలు, ఇత్తడి, స్టెయిన్‌లెస్ స్టీలుపాత్రలు, ప్లాస్టిక్ సామానులు మొ...

వినియోగదారుల నిమిత్తం యిక్కడ లాన్‌లో ఒక కేంటీను కూడా నడుపబడుతున్నది.

కల్పలత మన్నిక, నాణ్యం గల వస్తువులను సరసమైన ధరలకు కృతజ్ఞతాపూర్వకమైన సేవలతో వినియోగదారులకు అందించడానికి కంకణం కట్టుకున్నది.



'కల్పలత' సూపర్ బజారుకు డిశంబరు 14న ప్రారంభోత్సవం చేస్తున్న ముఖ్యమంత్రి.





ముఖ్యమంత్రి, సహకార మంత్రి శ్రీ తోట రామస్వామి, కల్పలత అధ్యక్షుడు శ్రీ సి.ఎన్.శాస్త్రి, తదితరులు.

# బిచ్చగాడు

తెలగతోటి రామకృష్ణ కవి

పేలికలై ప్రతిష్ఠ తలపించనిదోవతి; ప్రాతగిల్లి పా
దాల నిసర్గమైనకొల దాఁటిన చెప్పులు; చేతఁ గఱ్ఱ; మీ
సాలకుఁ దోడుగడ్డము; ప్రసాదముకోసరమేమొ చంకలో
జోలియ; యెవ్వరుండ? విటు జూడుము నా దెస; నీవు భిక్షుకా!

తిరిపం బెత్తుచుఁ గ్రుమ్మరిల్లెదవు దిగ్దేశాలు సంభ్రంబుతోఁ
బరభాగ్యాప్తవికృష్టజీవన సుఖప్రాబల్యముం గోరి; కాఁ
పుర మేమైనది కష్టకాముకుఁడవై ప్రౌఢంతకాలంబు నో
దరమాత్రంబున దృప్తి నెందెదవు పేదా! పొట్టయే స్వర్గమా?

ఎన్నాళ్లిట్లు ముగింపు లేనిపనిలో నేకాకివై బీదగా
సున్నల్ జుట్టుచు నుమ్మితోఁ గడుపుచిచ్చుం దీర్చుకొం దీవ? యు
త్పన్నం బైగతి లేనినీదిగులుసంసారంబులోఁ బిల్లలు
త్పన్నం బౌదు రదేమొ కొల్లగ; విచిత్రం బయ్యెడిన్ జూడగన్.

తనివోవం దినఁ గూడు చిక్కక యిదేతాత్పర్యభారంబుతో
దినగండంబుల చిక్కుచీఁకటి మహార్తిం గ్రుంగునీజీవితం
బును సంతుష్టమొనర్చు వారలేకదా! మున్ముందుకాలాన; ఖాం
తిని గోల్పోవక సాకు మేదొ యొకరీతిం దీయఁ గష్టం బెటో.

బలమైన కాఱుమబ్బులు క్రమ్ముకొన్ననీ
గుడిసెలోఁ బెద్దమ్మ గొడవసేయు;
నల్లిసూడులు పెత్తనమొనర్చు నీపాఁత
కుక్కిలోఁ జెడుగు గోకుడు రహించు;
పనిలేక మూలనఁ బడిమూల్గు నీమట్టి
కంచాన జీమలసంచు కలఁగు;
బక్కచిక్కి వాపుపారు పతనంబుగన్న నీ
కాయంబుపై మిత్తి కన్నువేయు;
భిక్షుకా! దొడ్డదినములు వెళ్లిపోయె
నీగతి విచారణము చేయునేత లేఁడు
ధారుణిపయి నేఁ: డేలవృథాశ్రమఁబు
తిరుగుటే కాని నీకర్మ తీర దన్న!

సిలుగుల బందిఖానఁ బడి చిక్కి కృశించుచుఁ గూలిపోవగా
నిలిచిన నీశరీరమున నెత్తురు లేదిపు డొక్కబొట్టు; కే
వల మొక పీనుగురూపునకు వచ్చితి వీవదియాస యేలఁ? బో
వల దిటురమ్ము సోదర! ప్రపంచము నీపయిఁ దాల్చె నిర్దయన్.

వెనుకనె పోయినారు మనవీరులు భక్తులు దానశీలురో
గొనముల భాగ్యశాలి! కొనగోఁటను సైత మదేమొ స్వార్థమే
కనఁబడు నెంతవారికడ; గౌరవహీన దరిద్రమూర్తివై
మునిఁగెను చింతలోన గవిపూజ్యుఁడు సైతము నీకు నుద్దియై.

# విజయోస్తు

ఓలేటి శేషాచార్యులు

కలిసె వేరైన తమ్ముల కరము లివిగొ
విరిసె నఖిలాంధ్ర వీధిలో వెలుగు విరులు
పలికె కవిగొంతు పంచమ స్వరముతోడ
అమ్మ విజయోస్తు నీకు నవ్యాంధ్ర లక్ష్మి:

రాష్ట్ర సిద్ధికి నైత్రికరణ విశుద్ధ
గాగకృషిసల్పినట్టిత్యాగధనవరులు
కొమరులుండంగ నీకేమి కొదువకలదు
అమ్మ విజయోస్తు నీకు నవ్యాంధ్ర లక్ష్మి:

తిక్కనార్యుని పలుకులో తీయదనము
ముక్తి పొంగారు పోతన్న భక్తిరసము
రాలగరగించు త్యాగయ్య రాగమహిమ
పాడెదను నేను గొంతెత్తి పరవశాన
అమ్మ విజయోసు నీకు నవ్యాంధ్ర లక్ష్మి

సకల పూర్వాంధ్ర సంస్కృతి స్వర్ణయుగము
వేంగి చాళుక్య సభలందు వేదవిధిని
తెలుగు సాహిత్య లక్ష్మికి తిలక మిడిన
ప్రణవమూర్తుల కీనాడు ప్రణుతి సేతు
అమ్మ విజయోస్తు నీకు నవ్యాంధ్ర లక్ష్మి:

విమల కృష్ణా తరంగిణీ విలసనముల
గౌతమీశ్రావ్య మాధురీ గానములకు
నేర్పుచున్నది రీతుల ఓర్పుతోడ
పరమ కల్యాణ దాయిని ప్రకృతి లక్ష్మి
అమ్మ విజయోస్తు నీకు నవ్యాంధ్ర లక్ష్మి:

అవిరళానందడోలిక లందు నూపు
సరస సంగీత సాహితీ స్వాదు. లలిత
కళల పాలిటి సౌభాగ్య కల్పవల్లి
అమ్మ విజయోస్తు నీకు నవ్యాంధ్ర లక్ష్మి:

లలితకల్యాణ భూషణాకలితయైన
తెలుగు లక్ష్మికి నాతేట తెనుగు గీత
కవన దివ్యామృతాభిషేకమ్ము సలిపి
మరల పాడెద నొకమాటు మనసు విప్పి
అమ్మ విజయోస్తు నీకు నవ్యాంధ్ర లక్ష్మి:

అందములు చింద చిరునవ్వు చిందులాడ
కలువకన్నుల మా తెల్గు కన్నెలదుగో
వరుస నిలిచిరి నీకు నివాళులొసగ
అమ్మ విజయోస్తు నీకు నవ్యాంధ్ర లక్ష్మి:

కూరగాయల
మొక్కలకు
ఇంతకు ముందు
లేని సరిక్రొత్త
రకమైన రక్షణ !



# రోగోర్®

## మొట్టమొదటి భారతీయ సిస్టమిక్ క్రిమిసంహారిణి

రోగోర్, అనేక పంటలకు ఇంతకు ముందు లేని సరిక్రొత్త రకమైన రక్షణ నిస్తుంది. ఆకుల, వేళ్ల ద్వారా అది పీల్చుకొనబడి మొక్క యొక్క పసరు ప్రవాహములోకి పోవును. అక్కడ అది రెండు వారములు వుంటుంది. ఈ సమయంలో మొక్క యొక్క పసరు త్రాగే ఏ చీడ క్రిములైనా చస్తాయి. రోగోర్ సురక్షితమైన క్రిమి సంహారిణి—మనుష్యులకు హానికరమైనది కాదు.

టాటా ఫైసన్ ఇండస్ట్రీస్ అత్యంత విస్తృతమై, అత్యధిక ప్రభావమైన క్రిమి సంహారిణులను చేయుదురని భారతీయ వ్యవసాయదారులకు పూర్తిగా తెలిసిన విషయమే. భారతదేశములో రోగోర్ను తయారు చేయుటకు వారు క్రొత్త ఫ్యాక్టరీని నిర్మించిరి.

రోగోర్ వాడండి—మొట్టమొదటి భారతీయ సిస్టమిక్ క్రిమి సంహారిణి—మీ కాయగూరల మొక్కల మీద...అత్యధిక, మంచి పంటలను పొందుదురని నిశ్చయపరచుకోండి.




* రోగోర్ మాంటెకాటిని, మిలాన్, ఇటలీ, యొక్క రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కు.

TATA FISON RALLIS

టాటా ఫైసన్
ఉత్పత్తి

# అడవి మల్లె

సీరియల్:

## జరిగిన కథ

ప్రసాదరావు చంద్రం అన్న ఇంటికి వెళ్ళగా అనూరాధ చూచి స్పృహకోల్పోయి, తేరుకుంటుంది. ప్రసాద్ ఆమె ప్రక్కనే కూర్చున్నాడు. ఆమెకు ముఖం చూపించలేక ఏడ్చుచున్న ప్రసాద్‌ను వారించింది. తెనాలి రైల్వే స్టేషన్‌లో అనూరాధ పడిన బాధనంతయు ప్రసాద్‌తో వెళ్ళబుచ్చుకున్నది. ప్రసాద్ తన గాధకూడ చెప్పుకొని తిరిగి తనవెంట వచ్చేయుమనీ, కూతురును వెదకే బాధ్యత తనదేనని అంటాడు. గౌరి చంద్రంతో తన ప్రేమను వ్యక్తంచేస్తుంది.

తన అన్న ఇలాటివాడని కలలోకూడా వూహించని చంద్రం ఆలోచనలు పరి పరి విధాల పోయాయి. మనస్సు వికలం అయింది.

చంద్రం చెరువుగట్టుకు చేరుకునేప్పటికి మసక చీకట్లు కమ్మాయి. చల్లగాలికి కొంచెం మనస్సుకు విశ్రాంతి దొరికినట్లయింది. చెరువు గట్టున వున్న ఒక బండమీద కూర్చుని నీళ్ళవైపు చూస్తూవున్నాడు. మనస్సును అనేక ఆలోచనలు ముసురుకుంటున్నాయి.

"బలే! బలే! రాజాలే! ఊ!".

అంటూ చప్పట్లుచరుస్తూన్న ఆడపిల్ల స్వరం వినిపించింది. చంద్రం ఆశ్చర్యంగా శబ్దం వస్తున్నవైపు చూశాడు. ఆ మసక చీకట్లో దూరంగా లంగా, ఓణీలోవున్న ఓ ఆడపిల్ల కనిపించింది. ఆ అమ్మాయి వీపు మాత్రమే చంద్రం వైపు వుంది. నేలవైపు చూస్తూ వంగి వంగి ఎవర్నో పుత్సాహపరుస్తుంది. చంద్రం విస్మయంతో చీకటిపొరలను చీల్చుకుంటూ చూట్టానికి ప్రయత్నించాడు. నేలమీద రెండు మానవ శరీరాలు పెనుగులాడటం కనిపించి గబుక్కునలేచి దగ్గరకు వెళ్ళాడు. ఇద్దరు కుర్రాళ్ళు పెనుగులాడటం కనిపించింది. ఆ అమ్మాయి చప్పట్లు చరుస్తూ అందులో ఒక కుర్రాణ్ణి ప్రోత్సహిస్తుంది.

చంద్రం ఆ కుర్రాళ్ళిద్దరికీ పదిహేను పదహారు ఏళ్ళకంటే ఎక్కువ వయస్సు వుండదని చూడగనే గ్రహించాడు. వెంటనే వంగి ఇద్దర్నీ చెరోరెక్కతో పట్టుకొని బలంగా విడదీసి నెట్టేశాడు. ఇద్దరూ ఆశ్చర్యంగా లేచినిల్చుని చంద్రం వైపుచూశారు ఆశ్చర్యంగా. ఇంతలో ఆ ఆడపిల్ల పారిపోవటానికి ప్రయత్నిస్తూ పరుగులంకించుకుంది. అది చూసి అందులో ఒక కుర్రాడు "ఏయ్! రజనీ! ఆగు! నేనూ వస్తున్నాను." అంటూ వెనకే పరుగెత్తాడు.

'రజనీ!' చంద్రం తృళ్ళిపడ్డాడు. వెంటనే రెండు అంగలో వెళ్ళి ఆ అమ్మాయిని పట్టుకొని ముఖంలోకి చూసి తెల్లపోయాడు. ఒకక్షణం చంద్రం నాలుక పిడచకట్టుపోయినట్లు మాట్లాడలేక పోయాడు.

"రజనీ! ఏమిటిది! ఈ వేళప్పుడు ఇక్కడకు ఎందుకొచ్చావ్" గట్టిగా అరచాడు చంద్రం. రజని భయంతో వణికిపోతూనే పట్టువిడిపించుకొని పారిపోవటానికి ప్రయత్నిస్తుంది, చంద్రం కోపంతో వణికి పోతున్నాడు. రజనిని ఇంకా గట్టిగా పట్టుకొన్నాడు.

"ఏయ్! ఎవరు నువ్వు! నా రజనిని పట్టుకుంటావ్?" హాలీవుడ్ హీరోపోజులో ఎదురుగా నిల్చొని దబాయిస్తున్న రాజాను చూడగానే చంద్రం కోపంతో పళ్ళు మర్చిపోయాడు, రజనిని వదలి రాజాను ఆ చంపా ఈ చంపా కసికొద్దీ వాయించాడు.

"బాబోయ్! రాజాను కొట్టకు! అంటూ పిచ్చిన రజని చంప చెళ్ళుమంది. ఆ యువకుడు రజని బాబాయి అని తెలుసుకున్న రాజా పరుగులంకించుకున్నాడు. అంతవరకూ దూరంగా నిల్చొని ఇదంతా చూస్తున్న రెండో కుర్రాడుకూడా చిన్నగా జారుకున్నాడు.

"పో రాస్కెల్. మళ్ళీ రజనితో కనిపించావా నీ రక్తం కళ్ళ చూస్తాను." గట్టిగా అరచాడు పారిపోతున్న రాజాను వుద్దేశించి.

వాసిరెడ్డి సీతాదేవి

రెండు చేతుల్లో ముఖం దాచుకుని వెక్కి వెక్కి ఏడుస్తున్న రజని రెక్క పట్టుకుని మొరటుగా లాగుతూ "పద ఇంటికి" గర్జించాడు చంద్రం.

"నన్ను వదులు. నా ఇష్టం! నువ్వెవరు రాజాను కొట్టటానికి" అంటూ ఏడుస్తూనే చంద్రంతో పెనగులాడుతున్న రజని మీదకు లేచిన చంద్రం చెయ్యి ఆగిపోయింది. ఒక క్షణం తమాయించుకొని మృదువుగా అన్నాడు.

"తప్పమ్మా! ఇలాటి పనులు చెయ్యకూడదు. పద ఇంటికి వెళదాం" అన్నాడు రజని తలమీద ఆప్యాయంగా నిమురుతూ.

దాంతో రజనికి కొంత ధైర్యం వచ్చింది.

"నువ్వు ఆ పిల్లతో తిరగొచ్చు, నాన్న జూలీతో తిరగొచ్చు, నేను రాజాతో తిరక్కూడదేం?" మొండిగా రెట్టించింది రజని.

చంద్రం ఓ క్షణం అయోమయంలో పడ్డాడు. పెద్దవాళ్ల ప్రవర్తన పసి హృదయాలమీద ఎలా పనిచేస్తాయో! బాధపడ్డాడు చంద్రం. ఈ రోజుల్లో బాల అపరాధుల సంఖ్య పెరుగుతుంది. కాని కారణం! పెద్దల నిర్లక్ష్యం, వారి ప్రవర్తన!

"తప్పమ్మా! అలా పెద్దవాళ్ళ గురించి మాట్లాడకూడదు. నువ్వింకా చిన్నపిల్లవు." మృదువుగా మందలించాడు చంద్రం.

బాబాయిని దేవతలా గౌరవించి ప్రేమించిన రజని బాబాయి ముందు తలవంచేసింది చివరకు.

"మరి ఇంకెప్పుడూ ఇలా రావుగదూ?" ఆప్యాయంగా తలమీద నిమురుతూ అడిగాడు చంద్రం.

"రాజా రమ్మంటాడు. రాకపోతే రాజాకు కోపం వస్తుంది." అంది రజని దిగులుగా.

"రాజాకు కోపంవస్తే రానియ్! ఇకనుంచి నువ్వు ఆ రాజాతో మాట్లాడకు." అన్నాడు చంద్రం.

"రాజాకు కోపంవస్తే నాకు ఏడుపువస్తుంది. మరి రాజాను నేను ప్రేమిస్తున్నానుగా. మాట్లాడకుండా వుండటం ఎలా?" సాలోచనగా అంది రజని.

చంద్రం ఉలిక్కిపడ్డాడు. నిండా పదమూడేళ్ళు లేని రజని ఏమిటిలా తయారయింది! ఇప్పుడు భయంతో చెప్పి లాభంలేదు. మంచిగా మనస్సుకు నచ్చచెప్పాల్సిందే అనుకున్నాడు చంద్రం. కొంచెం ఆలోచించి అన్నాడు. "మంచివాళ్ళను ప్రేమించాలమ్మా. అలా చదువుకు స్వస్తిచెప్పి బజార్లవెంట తిరిగే రౌడీల ప్రేమించకూడదు." తన జవాబు తనకే నచ్చలేదు. కాని అంతకంటే తెలిసీ తెలియని రజనికి ఇంకెలా చెప్పాలో అర్థంకాలేదు చంద్రానికి.

"నువ్వు ప్రేమించే ఆ అమ్మాయి మంచిదా! ఆ పిల్లను మరి అందరూ బజారు పిల్ల అంటున్నారు?"

చంద్రం మనస్సు చివుక్కుమంది.

"లేదమ్మా! ఆ అమ్మాయి చాలా మంచిపిల్ల. ఆ అమ్మాయిని నేను ప్రేమించటంలేదు." అన్నాడు చంద్రం.

"నిజంగా?" గుండ్రని కళ్ళను గిర్రున తిప్పింది రజని ఆశ్చర్యంతో.

"నిజంగానే. పాపం ఆ పిల్లకు అమ్మా, నాన్నా ఎవరూ లేరు. అందుకని ప్రకాశం అనే నా స్నేహితుని దగ్గరవుంటుంది." ఇంత చిన్నపిల్ల దగ్గిర ఇంత సంజాయిషీ చెప్పుకోవలసి వచ్చినందుకు బాధ అనిపించింది చంద్రానికి.

"మరి నువ్వు ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకోవూ!" ఆశ్చర్యంగా ప్రశ్నించింది రజని.

"ఊహూఁ నేను హేమ పిన్నిని చేసుకుంటాను." రజనికి హేమ అంటే ఇష్టం అని తెలుసు చంద్రానికి.

హేమ పేరు వినగానే రజని ముఖం వికసించటాన్ని గమనించాడు చంద్రం.

"నువ్వుకూడా హేమ పిన్ని అంత చదువుకుని పెద్దదానివయాక ఎవర్నయినా ప్రేమించి పెళ్ళి చేసుకోవచ్చు. అప్పటికి రాజా బాగా చదువుకొని మంచివాడయితే నువ్వు రాజానే పెళ్ళిచేసుకుందువుగాని."

చంద్రం చివరి మాటలు రజనికి బాగా నచ్చాయి. అది గమనించిన చంద్రం ఇంకెప్పుడూ రాజాతో తిరగనని రజనిచేత ఒప్పించాడు. నాన్న గురించి ఎప్పుడూ అలా మాట్లాడకూడదని చెప్పాడు.

చంద్రం రజనిని తీసుకుని ఇంటికి బయలుదేరాడు.

* * *

కారు పోర్టికోలోకి వచ్చి ఆగింది. కారు శబ్దంవిని వరండాలోకి వచ్చి నిల్చున్న కాంతమ్మ "అబ్బా కూతుళ్ళు అర్ధరాత్రిదాకా ఏ రాజ్యాలు ఏలుతున్నారు?" గర్జించింది.

కారు దిగి డోర్ వెయ్యబోయిన కృష్ణారావు చెయ్యి అలాగే ఆగిపోయింది. తెల్లముఖంవేసి భార్యముఖంలోకి చూశాడు.

"ఏమిటలా చూస్తావు? ఏదీ! అది ఇంకా కారు దిగదేం?" కోపంతో అరచింది కాంతమ్మ. కృష్ణారావు అయోమయంగా చూశాడు. కాంతమ్మ కారు దగ్గరకువచ్చి రజని లేకపోవటం చూసి తెల్లపోయింది.

"రజని ఏదీ?"

"రజని ఏదని నన్నడుగుతావేం? కొంచెం తెప్పరిల్లి అన్నాడు కృష్ణారావు.

"మీకు తెలియకుండా అర్ధరాత్రి దాకా అదీ ఎక్కడకు వెళుతుంది?" గాబరాగా అడిగింది కాంతమ్మ.

"అదే నిన్ను నేను అడుగుతున్నాను. తల్లివి ఇంట్లో వుండి ఈడొచ్చినపిల్ల ఎక్కడికుపోయిందో కూడా తెలుసుకోకుండా ఎలావున్నావ్?" సందు చిక్కిందే చాలన్నట్లు రెట్టించాడు భార్యను కృష్ణారావు.

"నాకేం తెలుసు? మీతోనే వచ్చిందనుకున్నాను." కూతురు ఏమయిందోనన్న దిగులుతో నీరసంగా అంది కాంతమ్మ.

గేటులో రిక్షా ఆగటంతోనే ఇద్దరూ అటువైపు చూశారు. రిక్షాలోనుంచి ముందు చంద్రం దిగాడు. ఆ వెనకే రజని దిగింది. అది చూసిన కృష్ణారావుకు కోపంవచ్చింది. కాంతమ్మకు వంటి మీద నిప్పులు పోసినట్లయింది. గాలి దుమారంలా గేటుదగ్గరకు వచ్చింది.

"ఏమయ్యా! నువ్వు అడ్డమైనవాళ్ళతో తిరిగేది కాకుండా నా బిడ్డనుకూడా చెడగొడుతున్నావా? ఎంతకు తెగించావు? ఏవే(" అంటూ రజని జుట్టు పట్టుకుంది కాంతమ్మ.

"ఏంరా! మమ్మల్ని ఇలాగయినా బతకనివ్వ దలచుకోలేదా? పసిదాన్ని అర్ధరాత్రిదాకా ఎక్కడ తిప్పుతున్నావ్?" కృష్ణారావు అడిగాడు కోపంగా.

చంద్రం ముఖం బాధతో నల్లబడింది. వెంటనే జవాబివ్వ లేక పోయాడు.

"ఏరా మాట్లాడవ్! ఆ అలగాజనంతో నువ్వు తిరిగేదికాక— నా బిడ్డను."

"అన్నయ్యా! మర్యాదగా మాట్లాటం నేర్చుకో! డబ్బులేని వాళ్ళు కాదు అలగావాళ్ళు. నీలా......"

"నోరుముయ్!" చంద్రం చంప చెళ్ళుమంది. కళ్ళ ముందు రంగులు కనిపించాయి.

"నాన్నా! బాబాయి తప్పేంలేదు." అంటూ ఏడుస్తూ ముందుకు రాబోయిన రజనిని కాంతమ్మ రెక్కపట్టుకొని లోపలకు లాక్కుపోయింది.

తీరా చెయ్యి జారిన కృష్ణారావు తప్పు తెలుసుకొని నిల బడి పోయాడు.

"పరవాలేదు. బాధపడకు. అన్నకు తమ్ముణ్ణి కొట్టే అధికారం ఎప్పుడూ వుంది."

చెంప నవరించుకుంటూ విషాదంగా నవ్వాడు చంద్రం. కృష్ణారావు మౌనంగా నిల్చున్నాడు.

"ఒకటి చెప్పక తప్పదు. తమ్ముడు ఎప్పుడు అన్న కంటె బలంగానే వుంటాడు. రజని భవిష్యత్తుకోసం, మన కుటుంబ క్షేమంకోసం నేను ఏం చేస్తానో నాకే తెలియదు. నువ్వు అడ వాళ్ళను కార్లలో వేసుకు తిరుగుతుంటే, నీ కూతురు ఏంచేస్తుందో ఏం తెలుస్తుంది. రజనిని అదుపులో పెట్టడం అవసరం" అన్నాడు చంద్రం.

కృష్ణారావుకు వళ్ళు మండిపోయింది.

"నీ బతుక్కి నువ్వు మరొకళ్ళ వేలుఎత్తి చూపిస్తున్నావా? దొంగతనం చేసి......

"ఆ దొంగతనం చేసింది నేనుకాదు. నాగేంద్రం."

కృష్ణారావు నమ్మలేనట్లు చంద్రం ముఖంలోకి చూశాడు.

"నమ్మలేకుండా వున్నావుగదూ? అవును నీరక్తాన్ని నువ్వు నమ్మలేవు. నా విషయంలో సంజాయిషీ ఇచ్చుకుందామని రాలేదు. ఎక్కడోవున్న రజనిని ఇంటికి తీసుకొచ్చాను. నీ విషయంకూడా కళ్లారా చూశాను. వదినకు ద్రోహం చేస్తున్నావు. నిన్ను ఎలా అదుపులో పెట్టాలోనాకు తెలుసు. వస్తాను. రజనిని మాత్రం కాస్త కనిపెట్ట వుండండి." తిరిగి చూడకుండా వెళ్ళిపోతున్న చంద్రాన్ని కొయ్యబారిపోయిచూస్తూ నిలబడ్డాడు కృష్ణారావు. అలా ఎంతసేపు నిల్చొని ఆలోచిస్తున్నాడో అతనికే తెలియదు.

తను చంద్రంమీద చెయ్యి చేసుకొని మంచిపని చెయ్యలేదు. రజని అంటే చంద్రానికి ప్రాణం. చంద్రం రజనిని చెడగొడుతున్నాడనటం కంటే మరోదారుణం లేదేమో! జూలీతో తన సంబంధం చంద్రానికి తెలుసా?

"ఏమండీ! చంద్రం ఏడీ? వెళ్ళిపోయాడా? కనిపిస్తాడేమో వెళ్ళి పిలవండీ!"

కృష్ణారావు అర్థం కాక అయోమయంగా చూశాడు భార్య ముఖంలోకి.

"అలా చూస్తారేమండీ! ఇంటి కొచ్చిన బిడ్డను అవమానించిపంపించాము. మీరు చెయ్యికూడా చేసుకున్నారు బిడ్డమీదా.

కృష్ణారావుకు తను వింటున్న మాటలు కలలోనో నిజంగానో అర్థం కావటం లేదు.

"అయ్యోరాత! అలామాటా పలుకూలేకుండా నిల్చుంటారేమండీ! పదండి లోపలకు. అమ్మాయి ఏంచెబుతుందో వినండి," అంటూ కాంతమ్మ కృష్ణారావు చెయ్యి పట్టుకుని లోపలకు పిల్చుకెళ్ళింది.

ఇన్ని సంవత్సరాల కాపరంలో ఏనాడూ చూడని మృదుత్వాన్ని కాంతమ్మలో చూసి కృష్ణారావుకు మతి పోయింది, మంత్రముగ్ధుడిలా లోపలకు నడిచాడు.

రజని జరిగిందంతా మళ్ళీ వల్లించింది తండ్రి దగ్గిర. కృష్ణారావు అంతా మౌనంగా విన్నాడు, చంద్రంను అవమానించినందుకు బాధపడ్డాడు.

'' చంద్రం లేకపోతే రజని ఏమయిపోయివుండేదో ! మనం తలెత్తుకు తిరిగే యోగం వుండేది కాదు. '' అంది కాంతమ్మ.

'' నాన్నా మరేమో ! నువ్వు జాలీతో...అనబోయి నాలుక కరచుకుంది రజని. కృష్ణారావు గాబరాగా కాంతమ్మ ముఖం లోకి చూశాడు. కాంతమ్మ అనుమానంగా భర్త ముఖంలోకి చూసింది.

'' క్షమించు కాంతం. నేను తప్పు చేసిన మాట నిజమే ; దానికి కారణం రోజూ నువ్వు నాతో పోట్లాడుతూ వుండటమే. అశాంతిగా ఇంట్లోనుంచి వెళ్ళిపోయే నేను కాలక్షేపం కోసం....

'' నన్ను ఇంత అన్యాయం చేస్తారను కోలేదు." కాంతమ్మకు దుఃఖం వుబికి వచ్చింది,

'' ఇవ్వాల్టి నుంచి నేను మారిపోతాను కాంతం. చంద్రం ఏమన్నాడో తెలుసా ? మావదినకు అన్యాయం జరక్కుండా వుండటానికి. నేను ఏంచేస్తానో నాకే తెలియదు. జాగ్రత్త అని నన్ను బెదిరించాడు.

కాంతమ్మకు చంద్రంమీద వల్లమాలిన అభిమానం పెరిగి పోయింది.

'' పాపిష్టి దాన్ని నేనే ఏనాడూ చంద్రాన్ని రెండు కళ్లతో చూడలేదు. చంద్రానికి నేనంటే ఎప్పుడూ అభిమానమే. మీరేనన్ను అన్యాయం చేశారు. "

'' క్షమించమన్నానుగా. మరోవిషయం కాంతం." ఆవిషయం నుంచి కాంతమ్మ ధోరణిని తిప్పటానికి ప్రయత్నించాడు కృష్ణారావు.

'' ఏమిటి ? ''

'' ఆదొంగ తనం చంద్రం చెయ్యలేదు. నాగేంద్రం చేశాడు. ''

'' ఆఁ '' కాంతమ్మ క్షణం పాటు స్తంభించిపోయింది.

'' ఎంత పని చేశాడండి చచ్చినాడు. అనవసరంగా బిడ్డను బాధించాము." కాంతమ్మ కంఠంలో దుఃఖం పొర్లు కొచ్చింది.

" ఏవండీ ? రేపే వెళ్ళి చంద్రాన్ని ఇంటికి పిల్చుకొచ్చేయ్యండి. మన చంద్రం పెళ్ళి చాల గొప్పగా చేసేయ్యాలి. రేపే ప్రసాదరావుతో మాట్లాడండి. ''

కాంతమ్మ మనస్సు ఎంత కఠినమైనదో అంత మృదువైనది అనుకున్నాడు కృష్ణారావు.

'' ఇంత అవమానం చేశాం. మళ్ళీ ఈ గడప తొక్కుతాడా చంద్రం ? '' కృష్ణారావు బాధగా అన్నాడు.

'' ఎందుకు రాడూ ! నేను కూడా వస్తాను పదండి. ఏలా రానంటాడో చూస్తాను. ''

కాంతమ్మ ఆత్మవిశ్వాసం మీద కృష్ణారావుకు ఆశ్చర్యం వేసింది.

'' నేనూ వస్తానమ్మా '' అంది రజని.

'' అలాగే తల్లి ! నువ్వు లేకుండానా ! అందరం వెళ్ళి బాబాయిని పిల్చుకుని వద్దాం ! అంది కాంతమ్మ సంతృప్తిగా నిట్టూర్చుతూ.

కృష్ణారావు సంతోషానికి అంతులేదు.

గోడ గడియారం పన్నెండు కొట్టింది. అందరూ లేచారు. పడుకున్నారే కాని ఎవరికీ త్వరగా నిద్ర పట్ట లేదు. అందరూ చంద్రం ఇంటికి వస్తే —— అనే విషయాన్ని వూహించు కుంటూ పడుకున్నారు.

బాధలో నిద్ర పట్టదు. ఆనందంలోనూ నిద్ర పట్టదు. సృష్టి వైచిత్రం !

* * *

ప్రసాదరావు పెద్ద జబ్బుపడి లేచిన వాడిలా తయారయ్యాడు. కారణం తెలియని హేమ తండ్రిని బలవంతంగా చాల మంది డాక్టర్లకు చూపించింది. కాని జబ్బేమిటో ఎవరూ తేల్చ లేక పోయారు. ప్రసాదరావు దేనికోసమో, ఎందుకోసమో మానసికంగా కుమిలి పోతున్నట్లు గ్రహించింది హేమ. చివరకు తనను గురించిన దిగులుతోనే తండ్రి అలా కుంగి పోతున్నాడని నిర్ణయించు కుంది. లేని ఉత్సాహాన్ని తెచ్చి పెట్టుకొని తిరగ సాగింది. అసలు చంద్రం అంటే తనకు ఎలాంటి ప్రత్యేక భావం లేనట్లు నటించ సాగింది. కాని ప్రసాదరావు ఆరోగ్యంలో మార్పు మాత్రం కనిపించటంలేదు. ఎప్పుడు ఏదో పోగొట్టుకున్న వాడిలా దిగాలు పడి కూర్చుని వుంటాడు.

ఆనాడు అనురాధను చూసిన నాటి నుంచీ ప్రసాదరావుకు కంటిమీద కునుకు లేదు. తన బిడ్డ ఎక్కడుందో ఏమయిందో తెలియదు. అతను కూడా అన్ని శరణాలయాలూ గాలించాడు. గిరిజ అనే అమ్మాయి ఆచూకీ దొరకలేదు. దొరికిన అనురాధ ఇంకా దూరంగానే వుంది. తన పాపానికి నిష్కృతి లేదా ! హేమకు చెప్పేస్తే ! ప్రయోజనం ! అనురాధను హేమ తీసుకొస్తే ! కాని అనురాధ రాదు. పైగా తను హేమకు ఈ విషయం చెప్పినందుకు కోపగించుకొని ఊరు వదిలి వెళ్ళి పోతుందేమో ! వీల్లేదు. తను ఈ నిప్పుల కుంపటిని ఇంకెంత కాలం గుండెల్లో దాచుకోవాలో !

ఆనాడు ప్రసాదరావు ఆరోగ్యం అసలు బాగాలేదు. ఎంత ప్రయత్నించినా ఒక ముద్దకూడా ఆహారంతీసుకోలేక పోయాడు.



రాత్రి దాదాపు తొమ్మిది గంటలవుతుంది. హేమ పాల గ్లాసుతో తండ్రి గదిలోకి వచ్చింది. గదిలో చీకటి రాజ్యం చేస్తుంది. హేమ స్విచ్ ఆన్ చేసింది. ప్రసాదరావు గాబరాగా కన్నీళ్ళు తుడుచుకోవటం చూసిన హేమ విస్తుపోయి నిల్చుంది క్షణం.

ఎందుకు నాన్నా ఆ కన్నీరు ! మీరు ఎందుకిలా కుమిలి పోతున్నారో నాకు అర్థంకావటం లేదు. నాతో చెప్పకూడని రహస్యాలు కూడా ఉన్నాయా ?'' అంది హేమ గద్గద స్వరంతో తండ్రి పక్కనే నిల్చుని.

ప్రసాదరావు తెచ్చి పెట్టుకున్న చిరునవ్వుతో ''అబ్బే ! ఏం లేదమ్మా ! ఈ అనారోగ్య పరిస్థితిలో మీ అమ్మగుర్తొచ్చింది '' బాధపడుతూనే అబద్ధమాడాడు ప్రసాదరావు. హేమ కూడా తండ్రి మాటలు నిజం కాదని గ్రహించింది.

''అదేమిటి నాన్నా మరీ అంత ఇది అవుతారు. ఇప్పుడు మీకేమయిందని ! అనవసరంగా ఏవేవో మనస్సులో పెట్టుకొని బాధపడకండి.'' అంది హేమ. ప్రసాదరావు కేవలం తననూ చంద్రాన్నీ గురించిన ఆలోచనలతోనే కృంగిపోతున్నాడని ఊహించుకుంటూ.

''నా గురించినాకు దిగులు లేదమ్మా ! నా తరవాత నువ్వు ఏమవుతావనే బెంగే ! ''

''అదినాకు తెలుసు నాన్నా ! నేను వివాహం చేసుకోలేద నేగా మీ విచారం. మీ ఇష్టం వచ్చిన వాళ్లను తీసుకురా నాన్నా చేసుకుంటాను.'' అనేసింది హేమ. హేమకు తను ఎవరిమీదో కసి తీర్చుకుంటున్నట్లనిపించింది.

''అమ్మా హేమ ! ఎందుకమ్మా అంతవిరక్తి. నీ మనస్సును అర్థం చేసుకోలేనంత మూర్ఖుణి కానమ్మా. చంద్రం చాలా మంచి కుర్రవాడు. లేకపోతే.

''నాన్నా !'' ఆవేశంతో అరచింది హేమ. ప్రసాదరావు అయోమయంగా చూశాడు హేమ ముఖంలోకి.

''ఏమిటమ్మా ! అలా ఉద్రేకపడతావు. చంద్రంతో రేపే మాట్లాడతాను. ఆ వివాహం కాస్తా అయిందనిపిస్తే ఆ చెడు సహవాసాలు వెంటనే మానేస్తాడని నా నమ్మకం. చంద్రం అవివేకికాడు.

"నాన్నా ! చంద్రాన్ని వివాహం చేసుకుంటానని మీతో అన్నానా ?" హేమ అంది ఇనుమడించిన ఉద్రేకంతో.

''నువ్వు నోరు తెరిచి చెప్పాలాపిచ్చి తల్లీ. కన్న తండ్రిని ఆమాత్రం నీ మనస్సును అర్థం చేసుకోలేనా ?'' హేమ ధోరణిని అర్థం చేసుకోని ప్రసాదరావు అన్నాడు ఆప్యాయంగా.

"మీరు పొరపడుతున్నారు నాన్నా ! చంద్రం అంటే నాకు అసహ్యం'' అంటూ వస్తున్న దుఃఖాన్ని ఆపుకొనే ప్రయత్నంలో హేమ ఆ గదినుంచి గబగబా వెళ్ళి పోయింది.

ప్రసాదరావు అయోమయంగా హేమ వెళ్ళి పోయినవైపే చూస్తూ కూర్చున్నాడు. బుర్రకు ఏ ఆలోచనా పాలుపోవటం లేదు.

* * *

రజనిని ఇంటికిచేర్చి ప్రతిఫలంగా చెంపదెబ్బతో బయటకు నడిచిన చంద్రం పిచ్చివాడిలా నిరుద్దేశ్యంగా కనిపించిన వీధులన్నీ తిరిగాడు. ఏదో అశాంతి హృదయాన్ని క్రూర మృగంలా నమల సాగింది.

తను ఏమి చేసినా ఇలా ఎదురు తిరుగుతుందేమిటి? చివరకు చెయ్యని తప్పుకు చెంపదెబ్బకూడా తిన్నాడు. తను అంత కాని పనులు ఏంచేస్తున్నాడని అందరూ అంత అపార్థం చేసుకుంటున్నారు ? రజనిని తను కావాలని చెడగొడుతున్నాడా ! ఆ ఊహ కూడా ఎలా వచ్చింది. అన్నయ్యకూ, వదినకూ అంతదారుణమైన అపవాదు తనమీద !

తన జీవిత సర్వస్వం అనుకున్న హేమకూడా తనను అపార్థం చేసుకుంటూంది. తనను ఒక నిముషం అసహ్యించుకుంటే మరో నిముషం ఆరాదిస్తున్నట్లు చూస్తుంది. దీనికంతా కారణం తనప్రవర్తనే నేమో ! ప్రకాశం చెప్పినట్లు తను వుండవలసినచోట వుండక పోవటం వల్లనే ఇన్ని అపార్థాలకు దారితీస్తుందేమో ! అదీ చూడాలి. ఆ ఇంట్లో తనకూ హక్కువుంది. తను వెళితే ఎవరు వద్దంటారో చూస్తాడు. రేపే వెళ్ళిపోతాడు. అన్నను మార్గంలో పెట్టాలన్నా, రజనిని పాడుకాకుండా కాపాడాలన్నా ఆఖరుకు హేమను తను దక్కించుకోవాలనుకున్నా ఇదొక్కటే మార్గం. చంద్రం మనస్సుకొంత తేలిక పడింది.

వెంటనే వెళ్ళి తన నిర్ణయాన్ని హేమకు చెప్పాలనే కాంక్ష కలిగింది. వాచీ చూసుకున్నాడు. తొమ్మిదిన్నర అయింది. ఇప్పుడు వెళితే బాగుండదు చెప్పకుండా, కాని తన నిర్ణయాన్ని హేమకు వినిపించకపోతే రాత్రంతా తనకు నిద్రపట్టదు. ఫోన్ చేసి చెప్తే!

చంద్రం ఎదురుగావున్న హోటల్లోకి వెళ్ళాడు.

"హల్లో!" హేమ స్వరాన్ని గుర్తించిన చంద్రం "నేను హేమా చంద్రాన్ని" అన్నాడు పరుగులు తీస్తున్న ఉత్సాహాన్ని అదుపులో పెట్టుకుంటూ. గబుక్కున రిసీవర్ పెట్టేసిన శబ్దం. చంద్రం అనుకోని కృష్ణారావు చెంపదెబ్బకు కూడా అంతతెల్ల పోలేదు.

హేమకు తనతో మాట్లాటం ఇష్టం లేదా! కేవలం తన పేరు కూడా భరించలేనంత అసహ్యాన్ని కలిగిస్తుందా! పొరపాటయి వుంటుంది. రాంగ్‌నంబరు కావచ్చు, ప్రవాహంలో కొట్టుకు పోతున్న వాడికి గడ్డిపరక ఆసరాదొరికినట్లు చంద్రం మనస్సును ఊరడించుకున్నాడు. మనస్సును కూడదీసుకుంటూ మళ్లీ డయల్ చేశాడు.

ఈసారి ఎంతకు ఎవరు ఫోను ఎత్తటం లేదు. చంద్రం అలాగే మొండిగా. ఎంత సేపు ఎత్తరో చూడాలన్నట్లు నిల్చున్నాడు రిసీవర్ చెవు దగ్గర పెట్టుకుని.

"హలో!"

"నేను హేమా! చంద్రాన్ని."ఈసారి చంద్రం మాటలు చాలా నిరుత్సాహంగా వున్నాయి.

"అయితే ఏమిటి! అర్ధరాత్రి పూట ఫోనులు చేస్తూ అనవసరంగా అల్లరి పెట్టకు"

"హేమా!"

హేమ రిసీవరు పెట్టేసింది. చంద్రం పరధ్యానంగా రిసీవరు పెట్టేసి బయటకు నడిచాడు. అతని హృదయం ఖాళీ చేసిన ఇల్లులా బావురుమంటూ వున్నట్లనిపించింది. గుండెల్లో భూగోళమంత ఖాళీ ఏదో గిర గిర తిరుగుతుంది.

చంద్రం మనస్సు ఆలోచించేస్థితిలో కూడా లేదు. నువ్వంటే. హేమకు అసహ్యం. నువ్వంటే హేమకు అసహ్యం" అంటూ ఎవరో నిర్దయగా తన చెవులో చెబుతున్నట్లనిపించింది చంద్రానికి.

చంద్రం తిరిగి తిరిగి ఇంటికి చేరేప్పటికి బాగా పొద్దుపోయింది. ఆగూడెం అంతా సద్దుమణిగివుంది. గడపలో కాలు పెట్టిన చంద్రం అలాగే ఆగిపోయాడు. గౌరి గడపకు చేరబడి కూర్చుని కునికి పాట్లు పడుతుంది, అలికిడికి ఉలిక్కిపడి లేచినిల్చుంది.

ఆమె ఎవరికోసం నిరీక్షిస్తూ కూర్చొందో చంద్రానికీ తెలుసు. మరో నాడయితే చంద్రం మనస్సు జాలితో కృతజ్ఞతతో నిండి పోయి వుండును. కాని ఈనాడు చికాకు వేసింది ఒక్క మాటకూడా మాటాడకుండా లోపలకు వెళ్ళి పోయాడు.

ప్రకాశం అప్పటికే గురకపెట్టి నిద్ర పోతున్నాడు. ప్రతి ఒక్కరికీ ప్రకాశంలా జీవించటం చాతనయితే ఎంత బాగుణ్ణు. తన అనే వ్యామోహంలేనివ్యక్తి కంటే అదృష్టవంతుడు మరొకడు వుండ దేమో! ప్రతియొక్కరి బాధ ప్రకాశం బాధే. అయినా సుఖంగా జీవించ గలుగుతున్నాడు. ఆలోచిస్తూ పక్క పరచుకొని మేను వాల్చాడు చంద్రం.

"అన్నం పెట్టాను" చిన్నగా భయం భయంగా అంది గౌరి చంద్రం పక్కదగ్గిరగా నిల్చొని.

"అక్కరేదు. నువ్వెళ్ళిపడుకో" కసురుకున్నాడు చంద్రం గిర్రునతిరిగి వెళ్ళి పోయింది గౌరి.

ఆలోచిస్తూ పడుకొనివున్న చంద్రానికి ఎవరో వెక్కి వెక్కి ఏడవటం వినిపించింది.

చంద్రం లేచి బయటకు వచ్చాడు. వంటింట్లో గోడకు చేరబడి గౌరి ఏడుస్తూంది. ఆమెక్క పక్కగా వడ్డించిన అన్నం పళ్లెం పెట్టివుంది.

ఆదృశ్యం చూచిన చంద్రం మనస్సు కరిగి పోయింది. తను మొరటుగా ప్రవర్తించటం తలచు కొని సిగ్గుపడ్డాడు.

'లే గౌరి! నేను నిన్నేమి అనలేదు, నీమీద నాకేమి కోపంలేదు, మనస్సు బాగుండక అలా కసురు కున్నాను." అన్నాడు చంద్రం బాధను సూచిస్తున్న స్వరంతో.

కళ్ళు తుడుచుకుని గౌరి లేచింది. పీట వేసి ముందు అన్నం పళ్లెం పెట్టింది .

"నేనేమన్నాను గౌరీ! అంత ఏడుపు వచ్చింది!" పీట మీద కూర్చుంటూ అడిగాడు చంద్రం మృదువుగా.

"కోప్పడ్డావని కాదు. నువ్వుఅన్నం తినకుండా పడు కున్నావు. అందుకే ఏడ్చాను."

నిష్కల్మషమైన గౌరి ప్రేమను భరించలేకపోయాడు. హృదయం తొణికింది. కళ్లలో నీరు తిరిగింది. చంద్రానికి ఊహ తెలిసిన తరవాత తనకోసం అంత బాధ పడేవ్యక్తిని, అంత ఆప్యాయతను ఏనాడు ఎరగడు. గౌరిని బలంగా గుండెలకు హత్తుకోవాలన్న ఆవేశాన్ని ప్రయత్నం మీద అణచుకున్నాడు.

"మరి నువ్వు భోజనం చేశావా గౌరీ!" చంద్రం గొంతు వణికింది. చంద్రంలో అంత సంచలనం ఏనాడుచూడని గౌరి చంద్రం ముఖంలోకిచూసింది. చంద్రం కళ్ళలోని ఆత్మీయతకు గౌరి మనస్సు పులకించింది లేదన్నట్లు తలవూపింది.

"అయితే నువ్వు కూడా వడ్డించుకో, ఇద్దరం భోజనం చేద్దాం" అన్నాడు చంద్రం.

గౌరి మౌనంగా నిల్చుండటం చూసి "అయితే నాకు అక్కర్లేదు" ముందువున్న కంచాన్ని దూరంగానెట్టాడు.

గౌరికి ఆక్షణంలో ఎవరోతనను అకస్మాత్తు పెద్ద కొండను ఎక్కించినట్లని పించింది. ఆమెశరీరంలోని ప్రతి జీవాణువూ ఆనందంతో స్పందించింది.

(సమాప్తం.)

# సంక్రాంతి

కేశవపంతుల నరసింహశాస్త్రి

సంక్రమణం, సంక్రాంతి, అనేవి పర్యాయపదాలు. మేషాది ద్వాదశరాసులలో సూర్యుడు ప్రవేశించే క్రమాన్ని అనుసరించి, ఇంచు మించుగా ముప్పది రోజులకాలవిభాగానికి సంక్రమణం అనేపేరు శాస్త్రకల్పితమై, లోకవ్యవహారంలోకి వచ్చింది. మేష సంక్రమణం అంటే మేషరాశిలో సూర్యుడు ప్రవేశించడం అన్నమాట. ఆరోజు నుండీ మళ్లీ సూర్యుడు వృషభరాశిలో ప్రవేశించే వరకు గడచే కాలానికి మేషమాసం అనిపేరు. ఈ పరిగణనాన్ని ముఖ్యంగా తమిళులు పాటిస్తారు. ఆంధ్ర మహారాష్ట్ర కర్ణాటక దేశాలలో పూర్ణిమ ప్రధానంగా అంటే చంద్రుడు పూర్ణిమనాడు ప్రవేశించే నక్షత్రాన్ని పురస్కరించుకొని, చైత్రమాసం, వైశాఖమాసం మొదలయిన నెలలపేర్లకు లోక వ్యవహారం సిద్ధమైంది. శ్రవణ నక్షత్ర యుక్తమైన పూర్ణిమ యే మాసంలో వస్తుందో అది శ్రావణ మాసం. అదేవిధంగా ఆయానక్షత్రాలతో కూడిన పూర్ణిమాతిథులు కలవి ఆయామాసాలు.

సంక్రమణం సర్వంగా అంగీకరింప బడడంచేత ప్రతి సంక్రమణమూ దేవపితృయోగ్యములయిన కర్మలుచేయుటకు అనువైనదే. ఆవిధంగా కొన్ని ప్రాంతాలలో ముఖ్యంగా తమిళ ప్రాంతంలో కొందరు ఆచరిస్తున్నారు. మన ఆంధ్రదేశంలో ఇతర సంక్రమణాలకు అంత ప్రాధాన్యం లేదు గాని, కర్కాటక సంక్రమణానికి కొంత వరకూ, మకర సంక్రమణానికి విశేషంగాను ప్రాధాన్యం ఉంది. సూర్యుడు కర్కాటక రాశిలో ప్రవేశించిన కాలం దక్షిణాయనంగాను, మకర రాశిలో ప్రవేశించిన కాలం ఉత్తరాయణంగాను, పేర్కొనబడి ప్రసిద్ధమై ఉన్నవి. మకరరాశి దక్షణ దిశయందును కర్కాటక రాశి ఉత్తర దిశయందును ఉన్నవి. మకరమునుండి సూర్యుడు కర్కాటకమును జేరుటకు ఉత్తరంగా పయనించవలెను, అదే విధంగా కర్కాటకము నుండి మకరమును జేరుటకు దక్షిణదిశగా పయనించ వలెను. కాగా కర్కాటక ప్రవేశం మొదలుకొని పయనించు కాలం దక్షిణాయనం అనీ, మకర ప్రవేశమాదిగా జరిగే గమనం ఉత్తరాయణం అనీ ప్రసిద్ధమైనాయి. సంవత్సరంలో ఆరేసి మాసాలు పట్టే సూర్యగమనాన్ని పురస్కరించుకొని ఉత్తరాయణ, దక్షిణాయణ ప్రవేశ కాలాలను పుణ్యకాలములుగాను, పర్వములుగాను భావించి, మనవారు దైవపితృ కర్మలను ఆచరిస్తున్నారు. అల్పకాలావధికములు, అంతఃపతితములు, అయిన ఇతర సంక్రమణములను దేవపూజాదికములయిన పండుగలకు అప్రధానములుగా భావిస్తున్నారు. పితృకర్మలను ఆచరించే శ్రద్ధగలవారు మాత్రం ప్రతి సంక్రమణంనాడుకూడా పితృతర్పణం చేస్తున్నారు-(మనుష్యమానంతో ఏర్పడిననెల పితృదేవతలకు ఒక్కరోజు, కనుక నెలకొకసారి మనం తర్పణం చేస్తే, వారి లెక్క ప్రకారం వారికి ప్రతి రోజూ ఆహారం లభించినట్టు అవుతుంది). ఉత్తరాయణ దక్షిణాయనములలోకూడా ఉత్తరాయణానికి అధిక ప్రాధాన్యం అనేక దృక్పథాలతో ఏర్పడింది. శాస్త్రీయమైన దృక్పథంలో మనకు అహోరాత్రముల వలె, దేవతలకు దేవమానంలో మన సంవత్సరం ఒక దినం. అంటే మన లెక్క ప్రకారం వారు ఆరుమాసాలు మేల్కొని, ఆరు మాసాలు నిద్రపోతారన్న మాట. ఉత్తరాయణం వారికి పగలు, దక్షిణాయనం రాత్రి. ఈ కారణంచేత దక్షిణాయనం కంటే ఉత్తరాయణం, దేవతలు మేల్కొని ఉండే కాలం కాబట్టి, శ్రేష్ఠ తరమని మనవారు భావించారు. శరతల్ప గతుడైన భీష్ముడు ఉత్తరాయణ కాలం వచ్చేవరకు యోగశక్తిచేత ప్రాణాలు చిక్కబట్టుకొని మకర సంక్రమణ ప్రవేశం తరువాత ప్రాణాలు విడిచి దివంగతుడైనాడు. జ్యోతిశ్శాస్త్రం వివాహాది శుభ కార్యాలకు ఉత్తరాయణానికిచ్చిన ప్రాధాన్యాన్ని దక్షిణాయనానికి ఇయ్యటం లేదు. వివాహాదిశుభ కర్మలకు యోగ్యమైన మాఘాది పంచకం ఉత్తరాయణాంతర్గతంగానే ఉన్నది. కనుక శాస్త్రీయ దృక్పథంలో ఉత్తరాయణారంభ కాలమైన మకర సంక్రాంతి అత్యంత పుణ్యకాలంగా భావింప బడుతున్నది.

ఇక లౌకిక దృక్పథంతో చూస్తే దక్షిణాయన ఆరంభ కాలం, అంటే కర్కాటక సంక్రమణం (ఇది సామాన్యంగా జూలై నెల ప్రాంతంలో వస్తుంటుంది.) ఏరువాక సాగడం, భూమిలో విత్తనాలు వెయ్యడం, మొలకలు అప్పుడప్పుడే మొలుస్తూ వుండడంవంటి సమయంలో వస్తుంది. గత సంవత్సరం పండిన పంట ఇంచు మించుగా అయిపోయి, మానవుడు దేవమాతృకము అయిన భూములపై ఆశపెట్టుకొని కృషిచేసే సమయం కాబట్టి ఆ సమయంలో అతనికి గొప్ప పండుగలు, ఉత్సవాలు, చేసుకునేటంత స్తోమతగాని, తీరుబడిగాని ఉండదు. కనుక జనబాహుళ్యం కర్కాటక సంక్రమణాన్ని పండుగగా ఆచరించడంలేదు. వైదిక కర్మ పరాయణులు మాత్రం పితృతర్పణ దేవ పూజాదికములు యథోచితంగా చేయడం జరుగుతున్నది. ఈ విధంగా ఇతర సంక్రమణాలు ప్రాధాన్యం కోల్పోవగా ఒకమకర సంక్రమణం మాత్రం అన్ని విధాలా ప్రాధ్యాన్ని సంపాదించుకొని, "సంక్రాంతి పండుగ" అన్న పేరుతోను, ఉత్తరాదిన "తిల్ సంక్రాంతి'' అన్న పేరుతోను, దక్షిణాదిన "పొంగల్" అన్న పేరుతోను ప్రసిద్ధమై ఆబాల శిశు వృద్ధమైన భారత ప్రజానీకం హృదయాలమీద మధుర ముద్రలు వేస్తున్నది.

వైదిక ధర్మ పరాయణులు, ఎప్పుడెప్పుడు మకర సంక్రాంతి (ఉత్తరాయణ పుణ్యకాలం) వస్తుందా అని ఎదురు చూస్తుంటారు. అది రాగానే పుణ్యనదీ జలంలో స్నానం చేస్తారు. ఆ సమయంలో స్నానం చెయ్యనివాడు రాబొయ్యే సప్తజన్మల్లోనూ రోగియై, దరిద్రుడవుతాడన్న ధర్మశాస్త్ర వాక్యం వారిని అలా చేయిస్తుంది. అంతేకాదు వారు పితృదేవతలకు అపిండకమైన శ్రాద్ధంచేస్తారు. ఉక్తకాలం ప్రకారం ఉపవాసం చేస్తారు. నువ్వులతో చేసిన గోవును దానంచేస్తారు. శివాలయంలో నువ్వుల నూనెతో దీపాలు వెలిగిస్తారు. శివునికి తిలతండుల మిశ్రితంగా అభిషేకం చేస్తారు. ఘృతాభిషేకం చెయ్యడం మహాఫల ప్రదమని వారి భావన. తెల్లని నువ్వులతో దేవ తర్పణమూ, నల్లని నువ్వులతో పితృ తర్పణమూ చేస్తారు. విధి విధానంతో శివార్చన చెయ్యడం చాలా ముఖ్యమని వారి అభిప్రాయము శివార్చనకు అంగంగా తిల సువర్ణ కంబలాది దానాలు అత్యంత ముఖ్యంగా పాటిస్తారు. ఈ సంక్రమణ పుణ్యకాలంతో చేసిన వస్త్రదానం మహాఫల ప్రదమనీ, తిలపూర్వక వృషభదానం రోగ విముక్తి దాయకమనీ, క్షీరంతో సూర్య ప్రతిమకు అభిషేకం చేయించడం సూర్యలోక ప్రదమనీ, ఈ సమయంలో ఏయే హవ్యకవ్యములు, దానాలూ చేయబడుతాయో అవన్నీ ప్రతి జన్మలోనూ సూర్యానుగ్రహంవల్ల పుష్కలంగా లభిస్తాయనీ వారి విశ్వాసం. ఆ విశ్వాసంతో సాగుతున్నవారిఆచారం ఇప్పటికీ మనకు సంక్రాంతి పండుగనాడు ఎక్కడో ఒకచోట సాక్షాత్కరిస్తూనే ఉంటుంది.

కొడుకులు, కోడళ్ళు, కూతుళ్ళు, అల్లుళ్ళు, పిల్లలు, పెద్దలు ఉన్న సంపన్న గృహస్థులకు ఈ పండుగ ఒక ప్రత్యేకమైన ఉత్సాహాన్ని కలిగిస్తుంది. ఆబాల గోపాలం అందరి హృదయాల్లోనూ ఒక వినూతనమైన ఆనంద ముద్రను వేస్తుంది. భోగి పండుగనాటి వంటలు, సంక్రాంతినాటి భక్ష్య భోజ్యాలు, ఇరుగు పొరుగువారికి ఇచ్చి పుచ్చుకొనే రంగురంగుల నువ్వులు, రకరకాల పిండి వంటలూ, ప్రతి గృహాన్నీ ఒక అపూర్వ శోభతో అలంకరిస్తాయి. కొత్త కోడలు మట్టి పిడతలలో చెరుకు ముక్కలు, రేగుపండ్లు, నువ్వులు, పసుపు కుంకుమలువేసి సింగారం ఒలుకబోస్తూ గృహిణులకు పంచుతూవుంటే ఇంటిలోని వారేకాక ఇరుగు పొరుగు వారుకూడా సంతోష భరితమైన హృదయాలతోనూ ముచ్చటను ఒలుకబోసే చూపులతోనూ చూస్తూవుంటారు. ఆరు నెలలు మొదలుకొని అయిదేళ్లలోపు వయస్సుగల బాల బాలికలను నట్టింట కూచోబెట్టి తలపైన బోడలు (రేగుపండ్లు, నువ్వులు, చెరుకు ముక్కలు, బియ్యము మొదలయిన వస్తువులు సోల, గిద్దవంటి కొలత పాత్రలలో ఉంచి) పోస్తూ ముత్తైదువలు పాటలు పాడుతుంటే ఆ పిల్లలను గన్న తల్లిదండ్రులతోపాటు అందరూ మురిసి పోతుంటారు. ఆడపడుచును అల్లుణ్ని పీటలమీద కూర్చోబెట్టి, నూతన వస్త్రాలు ఇచ్చే గృహస్థులు పొందే ఆనందాన్ని చూచి, ముసలమ్మలు మనస్సులలో బ్రహ్మానందం పొందుతూ ఆశీర్వదిస్తుంటారు. పెళ్లిగాని అమ్మాయిలూ, చదువుకునే అబ్బాయిలూ మితిమీరిన సంతోషంతో అల్లరి చేస్తూవుంటారూ. ప్రతియింటా సంక్రాంతి నూతన శోభను వెదజల్లుతూ ఉంటుంది.

ఈ పండుగ నగరాలలో ఇండ్లలో మాత్రమే తనస్థానం యేర్పరుచుకొని వినూత్నచైతన్యాన్నిపులకింప జేస్తే, గ్రామాలలో, పల్లెపట్టులలోనూ ఇంటాబయిటా అంతటా దీనికి పలికే స్వాగతం, దీనివైభవం, దృగ్గోచరమవుతాయి. అసలు పండుగ ఇంకా నెల రోజులు ఉందనగానే ప్రతిరోజూ తెల్లవారు జామున సాతానిజియ్యరు, '' హరిలో రంగహరి '' అని పాడుతూ తన యాయవరం ప్రారంభిస్తాడు. ముత్తైదువలు ముంగిళ్లలో రకరకాల ముగ్గులు ప్రారంభిస్తారు. సూర్య రథాలు, వైకుంఠ పాళీలు ముగ్గులలో తీరుస్తూ ముంగిళ్ళలో శృంగారం ఒలకబోచే పడుచు పిల్లలను చూస్తూ పొంగిపోయే రసిక హృదయాలకు అంతువుండదు. తెరచాటు ఎరుగని అమాయిక హృదయాలు పలికే సరస సల్లాపాలు అక్కడక్కడా వినవస్తూనే ఉంటాయి. గంగిరెద్దుల వాళ్లు ఇంటి ముంగిళ్లలోచేరి యువతీయువకుల క్రీగంటి ప్రసారాలకు మరికొంత దోహదం కలిగిస్తుంటారు. ఆర్భాటంతో కూడిన తమ పొగడ్తలతో భోగిమంటల చుట్టూ కూర్చున్న పురుషులకూ (ముగ్గులు తీర్చే స్త్రీలకూ ఏదో విధమైన సరస సంభాషణ జరుగుతూనే ఉంటుంది. పండుగ దగ్గరికి వచ్చిన కొద్దీ వారిఉత్సాహం వెల్లుబుకుతుంటుంది. మూడు రోజులు ముందుగానే (ముగ్గుల మీదికి గొబ్బెమ్మలు అవతరిస్తాయి. ఆవు పేడను సంపాదించి గొబ్బెమ్మలుచేసి, పసుపు కుంకుమలతోను, నువ్వులు నూకలు రేగుపండ్లతోనూ వాటిని అలంకరించడం, అలంకరించి గడపల ప్రక్కలలోను' ముంగిటి (ముగ్గుల మీదను వాటిని పెట్టడం, ఆడపిల్లలందరికీ ఒక ఆవశ్యకరణీయంగా ఏర్పడుతుంది. కొన్ని ప్రాంతాలలో పతంగులు (గాలిపడగలు) ఎగుర వేయడం మగపిల్లలకు ఒకతీరని పని (పెద్దలుకూడా కొన్ని ప్రాంతాలలో ఇందులో పాల్గొంటారు.) చెరుకు గడలు తెచ్చు కోవడం, చెరుకుపాలు త్రాగడంలో కూడా మగపిల్లలదే ముందడుగు.

అందరూ ఈ విధంగా సంబరపడుతూ, సన్నాహాలు చేస్తూవుండగా భోగిపండుగా, దానివెంట సంక్రాంతీ రానే వస్తాయి. భోగినాడు ప్రతియింటిలోనూ అవతరించే కూరగాయల సంఖ్య గణనాతీతంగా ఉంటుంది, గుమ్మడి కాయలు చిన్న యిళ్లల్లో సగం చోటును ఆక్రమిస్తాయి. భోగిపండుగనాడు బెల్లం క్రొత్త బియ్యం కలిపి వండిన పొంగలి, సజ్జపిండితో చేసిన రొట్టెలు, కలగూర విస్తళ్లలో సాక్షాత్కరిస్తాయి. సంక్రాంతి పండుగనాడు నువ్వులతో చేసిన రకరకాల పిండి వంటలు, గుమ్మడికాయ కూర, గారెలు, బూరెలు, ఇంకా ఏవేవో ప్రత్యక్షమౌతాయి మంచి సారవంతమైన క్రొత్త వస్తువుల భోజనమన్నమాట. స్వభావ సిద్ధంగాకాలం చలికాలం ఆరోగ్యవంతులైన వారికి ఈ కాలంలో జఠరాగ్ని బాగా ప్రజ్వరిల్లుతుంది. గాఢమైన ఆహారమంతా ఇట్టే జీర్ణమైపోతుంది. వైద్యశాస్త్ర పరిభాష ప్రకారం ఇది విసర్గ కాలం అంటే మానవునికి బలంచేకూర్చేకాలం అన్నమాట కాబట్టి అలాంటి పౌష్టికమైన భోజనం కావాలి.

(తరువాయి 36వ పేజిలో)

# భాగ్యచక్రం

ఆరెకపూడి కౌసల్యాదేవి

### జరిగిన కథ

వైద్య విద్యా పట్టభద్రుడయిన శ్రీనగేష్ సేవాతత్పరత ఆతని మామ శ్రీపతికి నచ్చదు. శ్రీపతి కుమారుడు శ్రీహరి వివాహం, సమయానికి కట్నం అందని కారణంగా ఆగిపోతుంది. తిరిగి వస్తూండగా కారు ప్రమాదంలో చిక్కుకొని శ్రీపతి గారికి మతిస్థిమితం తప్పుతుంది. శ్రీనగేష్ గ్రామంలో పెట్టిన ఆసుపత్రి–భాగ్యచక్రం చాలా అభివృద్ధి చెందుతుంది. దానిని చూచేందుకు శ్రీలక్ష్మి రాగా ఆమెకు తన ఆసుపత్రి పెట్టుటకు దారి తీసిన సంఘటనలను శ్రీనగేష్ తెలియజేస్తాడు. శ్రీలక్ష్మి తిరిగి వెళ్ళిపోతుంది. ఆ తరువాత శ్రీపతి యింటికి వెళ్తాడు శ్రీనగేష్. శ్రీపతిని, జయశ్రీని తనయింటికి ఆహ్వానిస్తాడు. శ్రీపతి, జయశ్రీ యిద్దరు "భాగ్యచక్రం" ను తిలకించి, నగేష్ ఇంటికి పోయి మర్యాదలపొంది తిరిగి ఇంటికి వెళ్తారు.

కొద్దిగా స్లో చేస్తూ "మీరు నిజంగా యిప్పుడు ఆస్పత్రికి అత్యవసరంగా హాజరవ్వాలా?" అనడిగింది శ్రీలక్ష్మి.

అంత వరకూ నిదానంగా రహదారి వైపే చూస్తున్న శ్రీనగేష్ మెల్లగా దృష్టి ప్రక్కకు త్రిప్పాడు, ఆమె వైపు.

శ్రీలక్ష్మి అతడివైపు చూడడంలేదు. స్టీరింగు త్రిప్పుతూ, దృష్టి బాటపైననే నిగిడ్చి వున్నది. "మా ఇల్లూ, కుటుంబమూ నచ్చలేదా, అలా పారిపోయి వస్తున్నారు?"

ఆమె స్వరం సహజంగానేవున్నా ఏదో నిష్ఠురత దాగి వున్నట్లే తోచింది శ్రీనగేష్‌కు. "మీ రెందుకలా అనుకున్నారు?" అన్నాడు చిరునవ్వుతో.

"అవునుమరి! మీరు బజారుకు వచ్చారు. హాసట్పల్‌కు వచ్చానని అబద్ధమాడుతున్నారు. మా నాన్నగారేదో అడుగుతూ ఉంటే మధ్యలోనే వచ్చేశారు.' నిందమోపుతూన్నట్లు అన్నది శ్రీలక్ష్మి.

తేలికగా నవ్వేశాడు శ్రీనగేష్. "హాస్పిటల్‌కే వచ్చానండీ. ఇక్కడ ఒక పరిచయస్థుడున్నాడు, సరే, జయ ఏదో దుస్తులు కొనుక్కోవాలంటే, ఎవరూలేరని సాహాయంగా మా అమ్మగారు వచ్చారు. వారిని దుకాణంలో దిగవిడచి నేను హాస్పిటల్‌కు పోయి మళ్ళీపని ముగిశాక వారికోసం వచ్చాను. అప్పుడే మీరూ వచ్చారక్కడికి."

కొన్ని క్షణాలు శ్రీలక్ష్మి ఏమీ మాట్లాడలేదు. "మీ అమ్మగారు కూడా ఏమిటో ముభావంగానే వున్నారు నాతో. ఎంత ఆలోచించినా నేను చేసిన తప్పేమిటో నాకు బోధపడకుండావున్నది." అన్నది కొద్దిసేపటికి మెల్లగా.

గంభీరంగా అన్నాడు శ్రీనగేష్, "మీది చాలా మృదు హృదయ మనుకుంటాను. అందుకే అంతగా బాధపడుతున్నారు. జయశ్రీ అంతగా అయిష్టం ప్రకటించుతూండగా అమ్మగారు ఒక్కరూ మీతో రావడం బాగుండదు, చూడండి! అంతే. అమ్మగారికి మీపై కోపమెందుకుంటుంది?" తల్లిని సమర్థిస్తూ లక్ష్మికి సర్దిచెప్పాడే కాని లోలోన అతడికి బాధగానే వున్నది తల్లి ప్రవర్తన.

మరి ఆ విషయమై సంభాషణ పొడిగించలేదు శ్రీలక్ష్మి. తిరిగి కొంతసేపు వాతావరణం నిస్తబ్ధమైపోయింది. "బీచ్ వెళ్దామా?" అన్నది హఠాత్తుగా అతడివైపు చూడకుండానే

గతుక్కుమన్నాడు శ్రీనగేష్ "ఎందుకండీ? అవసరమంటారా?"

పరుగిడుతూన్న కారును గేర్‌లో ఆపి దృష్టి అతడివైపు త్రిప్పింది శ్రీలక్ష్మి. "ఎందుకంత భయపడ్తారు? నేను మీతో స్నేహం చేయకూడనటువంటిదానను కాదండీ!"

చాలా నొచ్చుకున్నాడు శ్రీనగేష్. "నేనా దృష్టితో అనలేను లక్ష్మి. ఏమేమో ఊహించుకుని ఎందుకంత బాధపడ్తారు?"

శ్రీనగేష్ మాటలను శ్రీలక్ష్మి విన్పించుకోలేదు, "సాధారణంగా నేనెవరితోనూ స్నేహం చేయను డాక్టర్ గారూ. నిర్మలమైన మనస్సునూ, ఆప్యాయతనూ కాంక్షిస్తాను నేను. కొన్ని ప్రత్యేకమైన పరిధులలో స్నేహంచేసే వారిని చూస్తేనాకు ఆశ్చర్యంగానూ, అసహ్యంగానూ కూడ వుంటుంది. నేనలా పైపై మర్యాదలు పాటిస్తూ శుష్కప్రియాలు నటించలేను. అందుకే మీ సౌమ్యతా, ఆదరణా, ఆప్యాయతా చూచిన క్షణం నుండీ మీరూ మీ అమ్మగారూ నాకు గుర్తురాని క్షణమే లేదు. పోనీండి. మీతో స్నేహంచేసే అర్హతా, అదృష్టం నాకు లేకపోతే ఏంచేస్తాను?" అంటూనే శ్రీలక్ష్మి హాస్పిటల్ దారిగా త్రిప్పబోతూన్న కారు స్టీరింగ్‌ను బలవంతంగా తాను మళ్లీ తిన్నగా త్రిప్పాడు నగేష్.

"ఇప్పుడు మీకు మాటల రూపంలో ఏమైనా చెప్పే కంటె మీ ఆహ్వానాన్ని ఆజ్ఞనూ శిరసావహించితేనే మీకు నా మనస్సు అర్థమౌతుంది. సరే, పోనివ్వండి, మీ చిత్త మొచ్చినచోటికి." అన్నాడు చిన్నగా నవ్వుతూ.

"థాంక్స్." మనస్ఫూర్తిగా నవ్వింది శ్రీలక్ష్మి "అయితే ఊరవతల కొండల వేపుగా వెళ్దాం."

"మీ ఇష్టమన్నానుకదా! కాని ఒక్కటే విన్నపం. నేను ఇంటికి మాత్రం యివాళే వెళ్ళిపోవాలి."

"ఓ యస్!"

ఊరివెలుపల అందమైన పరిసరాలలో ఆగింది. శీతకాలం కావటాన ఆ సాయంత్రపుటెండకు తీక్షణత లేకపోయింది. ప్రశాంతంగా, ఏరొదా చికాకులేక ఉన్న ఆ ప్రకృతిలో, సూర్యాతపంలో అందాలను స్వంతంచేసుకొంటూన్న ఆ ఉన్నత గిరి శిఖరాలను, లలితమైన తరుపత్రాలను చూస్తూ ఒక పర్వత పాదతరుఛాయన కూర్చున్న వారిరువురికీ మధ్య కొంలదిసేపు సంభాషణే కరువైంది.

"ఇలా మౌనంగా గడిపివేయడానికి కంపెనీ ఒక్కర్లేదండి ఒక్కరైనా తేలికగానే గడచిపోతుంది." అన్నాడు శ్రీనగేష్ నవ్వుతూ.

ప్రతిగా శ్రీలక్ష్మి కూడా నవ్వింది. "మాట్లాడడం లేదని నిందా? పోనీ సంభాషణ మీరే ప్రారంభించ కూడదూ?"

"ఓహో! పిలువగానే వచ్చినందుకు అలుసైపోయాననుకుంటాను?" అన్నాడు తెచ్చికోలు గంభీర స్వరంతో.

కిలాకిలా నవ్వేసింది శ్రీలక్ష్మి. "చాలా చక్కగా మాట్లాడతారండీ మీరు! నిజంగా మాట్లాడాలనే కోరి తీసుకు వచ్చాను. కానీ తీరా మాటలు కరవైపోయాయి!" అన్నది తలవంచి గడ్డిమొక్కలు పీకుతూ.

"నిజమే ఒక్కొక్కప్పుడు మనసంతా భావమయమైనా, కంఠం అకారణంగా మూగ వోతుంది."

మరికొంత సేపు అలా సుమనోహర వాతావరణ పరిశీలన లోనే గడచిపోయిందికాలం.

'మనసు నిండుగా వున్న వేళ మాటలు దొరకవు!' అన్నాడు శ్రీనగేష్ చిరునవ్వుతో.

"ఔను!" "ఇక వెళ్దామా?"

"అలాగే. కాని ఏమిటో మీరు వెళ్ళి పోతానంటే బాధగా వున్నది. ఎందుకో తెలియని ఆత్మీయతానుబంధాలు ఏర్పడి పోయాయి మీతో, మళ్ళీ ఎంతకాలానికో తమ దర్శన భాగ్యం?"

"అలాగనకండి." కారువైపు నడుస్తూ సంభాషణ సాగింది. "నన్నేదో గొప్ప అతిథుని చేసి మాట్లాడుతున్నారు మీరు, నేనూ మీ వంటివాడనే. వీలైతే మళ్ళీ రేపే వస్తాను."

"రేపే!" సంతోషంగా అడిగింది శ్రీలక్ష్మి.

"అవును. మీతో ఒక విషయం మాట్లాడాలని అనుకుంటు న్నాను. కాని సంశయంతో మాట్లాడలేకపోయాను."

"ఏమిటది? అంత సంశయం దేనికండి? నిరభ్యంతరంగా మాట్లాడవచ్చు."

అంటూనే కారు మెల్లిగా బయలుదేరదీసింది శ్రీలక్ష్మి.

ఆమెవైపే చూస్తూ మంద గంభీర స్వరంతో అన్నాడు శ్రీనగేష్; "ఇదేమీ షరతు గానూ, బలవంతంగానూ మాత్రం భావించకండి, ఒక సంగతి అర్థిస్తున్నాను. మీరు అంగీకరిస్తే ఆనందిస్తాను!"

"సందేహంవద్దు. చెప్పండి. మీ మాట నేను కాదనను, నా చేత కాదనిపించే విషయమేమీ మీరు అనరు. మీపై ఆగౌరవ నమ్మకాలు నాకున్నాయి."

"కృతజ్ఞుడిని." పరిపూర్ణ దరహాస వదనంతో అన్నాడు శ్రీనగేష్. "చెప్తున్నాను; ఏమీ కలవర పడకండి............ శ్రీపతి గారికి కొంత మనః స్వాస్థ్యం చెడిందని మీకూ తెలుసు."

"అవును?"

"ఆయనకు ఒక్కొక్క వ్యక్తిని చూస్తే, ఒక్కోవిషయం గుర్తుకువస్తే మనోవైకల్యం ఒక్కో రీతిగా వుంటుంది; ఒక్కొ రకం ధోరణి వచ్చేస్తుంటుంది. అది మీకు తెలుసా?"

"అంత వివరంగా తెలియదు. చెప్పండి."

"నేను ఆయన కుమారుల వయస్సు వాడిని కావడంతో నన్ను చూచి నప్పుడల్లా ఆయన ధోరణి ఒక ప్రత్యేక మార్గం త్రొక్కుతుంది. ఆ కుమారుడికి ఉత్తరం వ్రాయమనీ, ఢిల్లీ వెళ్ళి తీసుకు రమ్మనీ అంటూంటారు."

విచారభారంతో విన సాగింది శ్రీలక్ష్మి.

"కారు హారన్, మోటారు శబ్దం-ఇటువంటివి ఏమి వింటున్నా, చూస్తున్నా భయంతో నిలువునా గజగజలాడి పోతారు. కేకలేసి ఏడుస్తారు."

చెప్పడం ఆపి శ్రీలక్ష్మి దెస దృష్టి త్రిప్పాడు, కారు పట్టణాన్ని ప్రవేశించడం వల్ల జాగ్రత్తగా రోడ్డు మీదనే దృష్టివుంచి నడపుతూన్నది శ్రీలక్ష్మి.

"ఏం, చెప్పడం ఆపుజేశారు?'' అన్నది అయిదు నిముషాలు పోయాక, అతడివైపు చూడకుండానే.

డాక్టర్ మాట్లాడలేదు.

"చెప్పండి డాక్టర్ గారూ. ఇందులో నేను చేయవలసిన పనేమున్నది?'' అడిగింది శ్రీలక్ష్మి.

"నా మాట వినగానే ఖంగారు పడకండి, జాగ్రత్తగా ఆలోచించండి."

"అలాగే, చెప్పండి.''

అంతలోనే కారు హాస్పిటల్ ముందు ఆగింది.

కారు దిగి తలుపు వేస్తూ, తనవైపే చూస్తున్న శ్రీలక్ష్మితో అన్నాడు; "మిమ్మల్ని అచ్చంగా ఆనాటి పెండ్లి కుమార్తె వేషంలోనే చూస్తే శ్రీపతి గారిలో కదలికలు ఎట్లా వుంటాయో చూడాలని వున్నది!''

వింటూనే ఉలికి పడింది శ్రీలక్ష్మి. ఏమీ మాట్లాడలేక పోయింది, కనుపాపలు కలవరంతో కదులాడాయి.

"కోపం వచ్చిందా?" మెల్లని స్వరంతో అడిగాడు శ్రీనగేష్.

"ఊహుఁ.'' తల త్రిప్పింది శ్రీలక్ష్మి,

''మరి ? బాధ పడుతున్నారా ? మిమ్మల్నేదో వైద్య పరికరంగా ఉపయోగించుతున్నానని బాధ పడవద్దు. ఇలా అడగడానికి నాకే సిగ్గుగా, నొప్పిగా వున్నది. కాని......... .......నమ్మకంగా చెప్పలేను కాని, ఆయన పరిస్థితి మిమ్మల్ని ఆ వేషంలో చూచిన తర్వాత కొంత మెరుగవ్వగలదని ఆశిస్తున్నాను !"

భార హృదయంతో నిట్టూర్చింది శ్రీ లక్ష్మి ''సిగ్గు పడడం, బాధ పడడం ఇది వరకే అయిపోయాయి. ఇప్పుడిక అటువంటిదేమి లేదు. ఈ దురదృష్ట జాతకురాలి వలన కూడ ఒక జీవితం బాగుపడగలదంటే—అంత కంటే కావలసినది లేదు. కాని బొత్తిగా నన్నంత హీనంగా చూస్తున్న జయశ్రీ యింటికి రావడమంటే ఏమూలనో అభిమానం తలెత్తుతున్నది. ఎంతైనా మానవ మాత్రులం కదా !'' అంటూ నవ్వలేక నవ్వింది.

పట్టరాని సంతోషాన్ని పైకే ప్రదర్శించేశాడు శ్రీనగేష్. "మీ సహృదయతకు చాలా సంతోషిస్తున్నాను శ్రీలక్ష్మి గారూ. నా మాటపై అంతగౌరవం వుంచిన మీకు నేను అగౌరవం జరుగనిస్తానా? మీరు వారింటికి రావద్దు. మా ఇంటికే వద్దురుగాని. అక్కడికే వారిని రప్పించుతాను. మీకు ఏవిధమైన హానీ, అమర్యాదా జరుగనీయను. నేను మీ దగ్గరేవుంటాను. తిరిగి క్షేమంగా మిమ్మల్ని మీ యింటికి పంపే పూచీనాది."

''ఇక అదివేరే చెప్పాలా? మీ దగ్గఱ నాకేం భయంలేదు. తప్పక వస్తాను.''

''మీ అమ్మగారికి నాన్నగారికి మీరు చెప్పగలరా, నన్ను చెప్పమంటారా? ''

"ఎవ్వరం చెప్పక్కర్లేదు. అటువంటి విషయాలు పెద్దలకు తెలియక పోవడమే మంచిది!''

''నిజమే! ఈ లోగా నేను ఇంకా బాగా ఆలోచించి రేపుగానీ ఎల్లుండి గానీ వస్తాను. మీకు తీరికేనా?''

''ఓ! రండి.''

''కృతజ్ఞుడను. అయితే మీరు వెళ్ళండి. నమస్కారం.''

"నమస్కారం!''

మెల్లగా కారు బయలుదేరదీసింది శ్రీలక్ష్మి బలవంతంగా అతడి మీదినుండి చూపులు త్రిప్పుకుంటూ.

కారు కనుచూపుమేర దాటిపోయే వఱకూ చూచి, వెనుదిరిగి హాస్పిటల్ లోకి వెళ్ళి పోతూన్న శ్రీనగేష్ హృదయం నుండి బలమైన నిట్టూర్పు వెలువడింది. 'ఎంతటి అపురూప స్వభావం! ఏ భాగ్యమూర్తికోసం పుట్టిందో యింత సున్నిత హృదయిని! ఎవరో చని పోయినందుకు తాను దురదృష్ట వంతురాల ననుకొంటున్నది. కాని తనను పొంద అర్హతలేని దురదృష్టవంతుడు పోయాడనీ—ఎవరో అదృష్టవంతుడు ఎక్కడో తనకై తపస్సు చేస్తున్నాడనీ, ఈ ముగ్ధకు తెలియదు......పాపం! అమాయకురాలు. నాపై యేవేవో ఆశలు పెంచుకొంటున్నట్టుంది. కాని నా అసల సంగతి తెలిస్తే ఎంతబాధపడుతుందో! అంతవరకూ రానీయకూడదు, ఎప్పుడో సమయం చూచి త్వరలోనే నావిషయం చెప్పెయాలి.'

X X X

'' అమ్మా ! '' అని మీద వాలి పోయిన శ్రీధర్ ను "కళ్ళు కాయలు కాచి పోయాయి రా బాబూ !" అంటూ గుండెలకు హత్తుకున్నది శ్రీదేవి '

'' అమ్మా, మరేం ! నేనూ అప్పుడప్పుడూ నీ కోసం ఏడిచేవాడిని. బాగా చూడాలనివుండేది. ''

శ్రీదేవి కన్నీరు యింకా కట్టువడలేదు. అలా ఆ బాలుడి తల అక్కునజేర్చుకుని సవరిస్తూండిపోయింది. పిల్లవాడికిమాత్రం అదేమీపట్టలేదు. " అమ్మా ! మరేం-మేమంతా యింగ్లీషులోనే మాట్లాడాలి. ప్రతిదీ టైం ప్రకారం చెయ్యాలి...... " అంటూ ఏమేమో చెప్పేస్తూన్నాడు.



అందాలు చిందుతూన్న ఆ పసిబాలుని చూస్తూ జయశ్రీ కొంతసేపు అలా ముగ్ధురాలైపోయి మౌనంగావుండిపోయింది.

" మరేం, అమ్మా ! హరగోపాల్ అని మా స్నేహితుడో అబ్బాయివున్నాడు. అతడి తల్లితండ్రి చూచుకోవడానికి ఓ సారి మా స్కూలు వొచ్చారు. ఇప్పుడు ఆ అబ్బాయికోసం స్టేషన్ కొచ్చారు. అలా యింకా యింకా చాలామంది వచ్చారు. మరి నువ్వు నా కోసం రాలేదేం ? "

" ఇక్కడి కొచ్చానుకదా బాబూ ? " ఎలాగో గొంతు సరిజేసుకుని సమాధానం చెప్పింది శ్రీదేవి.

" ఎవర త్తయ్యా ఈ అబ్బాయి ? " ఇక ఆశ్చర్యం పట్ట జాలని జయశ్రీ ప్రశ్నించింది. " నిన్ను అమ్మాఅంటాడేమిటి !? "

శ్రీదేవి విషాదంగానవ్వి యేమో అనే లోగానే సిసింద్రీ లాగా శ్రీధర్ చెప్పాడు సమాధానం. " నువ్వెవరు ? మాఅమ్మను అత్తయ్యా అంటావేం మా అమ్మచాలా మంచిది. మానాన్న డాక్టర్ ! "

" డాక్టర్ ! ! ! " జయశ్రీ అమిత విస్మయంతో అరిచింది " డాక్టర్, డాక్టర్ " అని తనలోతను గొణుక్కుంది. "మీనాన్న డాక్టరా ? ఎవరాయన ?

" డాక్టర్ శ్రీనగేష్ ! !" హుందాగా, సగర్వంగా చెప్పాడు శ్రీధర్.

" అదేంటమ్మా అలా అడుగుతారు ? మన డాక్టరుబాబు గారి అబ్బాయిగారే !" నౌఖరూ, కారు నడుపుతూన్న డ్రైవరూ కూడా ఒకేసారి సమాధానం చెప్పారు.

జయశ్రీ మానసిక స్థితి వర్ణనాతీతం. ఒక సారిగా, ఆవార్త చెప్పిన వ్యక్తులూ, అందుకు కారణ భూతుడైన ఆబాలకుడూ, అతడి తండ్రీ, లోకం_అంతా అసహ్యాకరంగా కన్పడ్డసాగాయి. మాటల కందని ఆవేశం అవే ప్రతి కదలికలోనూ ప్రదర్శిత మయ్యింది, శ్రీధర్‌ను పురుగును చూచినట్టుగా చూచింది. మేనత్తను అసహ్యంగా చూచింది, పరుగెడుతూన్న ఆకారులో కూర్చోవడమే ఓ మహాపాపంగా అపరాధంగా భావించింది, ఈ మనుష్యులెవ్వరిని చూడటం ఇష్టం లేనట్టుగా కారు కిటికీలోనుంచి ముఖంబయటకు పెట్టుకు కూర్చుంది.

ఆమె ఆ ఆగ్రహం, అవధులు దాటిన ఆ ఆవేశం, మర్నాడు అపరాహ్ణావేళ ఆదిత్య తాపాన్నికూడా సరకు జేయక తను యింటికి నడచి వచ్చిన శ్రీనగేష్‌ను పట్టి దులిపేసే వఱకూ అలాగే నిలచి వున్నాయి.

ఎండలో నడచి వచ్చిన అతడిని కన్నెత్తి చూడలేదు; పన్నెత్తి పలుకరించలేదు.

ఆమె అమర్యాదకర ప్రవర్తనకూ, ఆమె వదనలో తాండవిస్తున్న అప్రసన్నతకు శ్రీనగేష్ ఏమీ చలించలేదు, " మామయ్య కోసం ఒక మేల్‌నర్స్‌ను తీసుకొస్తానన్నానుకదా ? వచ్చాడు. మామయ్య ఏంచేస్తున్నారు ?" అని తనకు తానే మాట్లాడాడు.

జయశ్రీలో అప్పటికి చలనం కలిగింది, "ఓ! అయితే నర్సును తీసుకొచ్చారా? " అన్నది. తప్పనిసరిగా అన్నదేకాని కూర్చున్న చోటునుండి లేవనేలేదు.

డాక్టర్ నగేష్‌కు లోలోన బాధకలిగినా పైకి సౌమ్యంగానే మాట్లాడాడు. " మామయ్య ఏం చేస్తున్నారు ? నర్సుకు అన్ని చూపి అతడి పనేమిటో చెప్పి నేను వెళ్ళిపోతాను. నడువుపైకి," అంటూనే "చంద్రం! ఇలారా, అని పిలిచాడు, వెంటనే నర్సు చంద్రం ఎదరకు వచ్చాడు.

మేడ మీదకు నడిచిన ముగ్గురికీ ఒక ప్రత్యేకమైన దృశ్యం కంటపడింది, శ్రీపతి ఏదో పుస్తకంలోని కాగితాలను ఒక్కొక్కటే తీసి కసిగా కక్షగా ముక్కముక్కలుగా చింపి పోస్తున్నాడు.

(సశేషం)



శ్లో॥ జటా నేయం వేణీకృతకచకలాపో; న గరళం
గళే కస్తూరీయం; శిరసి శశిరేఖా న కుసుమమ్;
ఇయం భూతిర్నాంగే ప్రియవిరహజన్మా ధవళిమా;
పురారాతిభ్రాంత్యా కుసుమశర ! కిం మాం ప్రహరసి ?॥

—చాటువు.

" ఒకవిరహిణి మన్మథుని సంబోధించి, " నావేషము చూచి నేను శివుడ నని కొట్టు చున్నావా ! అట్లు కాదు " అని చెప్పు చున్నది:-" ఇది శివునిజట కాదు, జడగా అల్లుకున్న నా కేశపాశము; కంఠమునందు విషము కాదు, కస్తూరి రేఖ; శిరస్సునందు చంద్ర రేఖ గాదు, కుసుమము; శరీ రమునందు విభూతి కాదు, ప్రియునియెడబాటువలన గలిగిన తెలుపు సుమా ! మన్మథా ! శివు డన్భ్రాంతిచేత నన్ను కొట్టు చున్నావా యేమి ?

శ్లో॥ రవిసంక్రాంతసౌభాగ్యస్తుషారారుణమండలః।
నిశ్వాసాంధ ఇవాఽదర్శశ్చంద్రమా న ప్రకాశతే॥

—వాల్మీకి.

" మంచుబుతువునందు సూర్యునిలో సంక్రమించినసౌందర్యము గలిగి, మంచు గప్పుటచేత ఎఱ్ఱబారినమండలము గలచంద్రుడు, నిట్టూర్పు తగిలి ప్రతిబింబము కనపడనిఅద్దము ప్రకాశించనట్లుగా ప్రకాశించుట లేదు. "

కం॥ తా నెఱిఁగినవిద్య నృపాఽస్థానములో నెరపఁ గీర్తి సమకూరుం గా
కేనరునకుఁ బరవిద్యాఽధీనత భూపాలసభలఁ దేజము గలదే ?॥

—ధూర్జటి.

" రాజాస్థానములో తనకు తెలిసినవిద్య ప్రకటించినచో కీర్తి కలుగుమ గాని, యెరువు తెచ్చుకొన్నవిద్యను జూపినచో నది ప్రతిష్ఠ తెచ్చునా ?

చ॥ మనమునఁ గొన్న నెవ్వగలు మాన్పి ఘటింతురు కావ్యసమ్మదం;
బనఘకథాముఖంబున హితాహితబోధ మొనర్తు రింపుగాఁ;
గనుఁగొమకంటె నద్భుతముగా నెఱిఁగింతు రతీంద్రియార్థముల్ ;
ఘనమతు లెల్లవారికి నకారణబంధులు గారె సత్కవుల్.

—'సంకుసాల నృసింహకవి.

మ॥ ఘనపీన స్తనకుంభమండలముపైఁ గస్తూరి నొప్పారఁగాఁ
గొనగోరన్ నిను వ్రాసి, 'యీవిధమునం గూర్చుందువే! యంచు ఝు
ల్లన రోమాంచము నించి యశ్రువులు జాలై పారఁ బద్మాక్షి వె
చ్చనినిట్టూర్పు నిగుడ్చు నీధృతికిఁ గృష్ణా ! వల్లవీవల్లభా !

--రాధామాధవకవి.

" రాధ, తనకుచములపైనున్నకస్తూరిని గోటితో తీసి కృష్ణునిచిత్రమును వ్రాసి ' యిట్లు గూర్చున్నావే ' యని చూచి హృదయము ఝుల్లు మనగా శరీరమున పులకలు ఆమెకు కలిగినను, నీవు కదలక కూర్చొని యుండుటను జూచి కన్నీరు ధారగా నేడ్చి వేడినిట్టూర్పును విడుచునుగదా ! కృష్ణా ! గోపికావల్లభా !"

ఉ॥ యావరసార్ద్రిమున్, గిసలయారుణకోమలమున్, వినూత్నర
త్నాఒవళినూపురంబును, మదాలసభావము నౌపదంబుచే
నేవరపూరుషుండు ప్రణయేర్ష్యఁ బరాంగనచేతఁ దాడితుం
డై విలసిల్లు, వాఁడు కుసుమాఒయుధదేవునకుం బ్రియుం డగున్.

—తాళ్లపాక తిరువెంగళప్ప.

"లత్తుక పూసికొని, రత్నపుటందెలు కలిగి, మదముచేత తిన్నగా నడచు కోమలపాదముచేత పరాంగన ప్రణయ కోపముతో ఏ పురుషుని కొట్టునో అట్టివాడు మన్మథునకు అతి ప్రియుడగును."

మ॥ పదలాలిత్యము, వర్ణశుద్ధియును, శబ్దస్థైర్యమున్, మంగళా
స్పదభావంబును, రాజయోగ్యతయు, దోషస్ఫూర్తిరాహిత్యమున్,
సదలంకారవిశేషమున్ గలిగి, విశ్వప్రాణసౌభాగ్యసం
పద మై తేజియవోలెఁ గ్రాలవలదా పద్యంబు హృద్యస్థితిన్ — పెదపాటి సోమయ్య.

ఆ॥వె॥ దారసంగ్రహంబు ధరణీశ! రతి-పుత్రఫలము, శీల-వృత్తఫలము శ్రుతము,
దత్త-భుక్తఫలము ధనము, వేదము లగ్నిహోత్రఫలము లనియు నెఱుఁగు. —నన్నయ భట్టారకుడు.

కం॥ మెలఁతకుఁ బతిపై నైనను, మెలఁతుకపైఁ బతికి నైన మేలగు నెందున్
గలయది; మెలఁతకుఁ బతికిన్ వలపు సమం బగుట జన్మవాసన చెలియా! —అల్లసాని పెద్దనామాత్యుడు.

సీ॥ మేళవించినవి సుమ్మీ! దీనిమెట్లని మాంసలాంసంబున మహతిఁ జేర్చి,
మిన్నేటిజలము సుమ్మీ! తొలకెడు నని డాచేత మణికమండలు వొసంగి,
యిది జపోచితము సుమ్మీ! జతనం బని వలచేతఁ బద్మాక్షవలయ మిచ్చి,
యీశానుఁ డిచ్చెఁ జుమ్మీ! మాకు నిది యని శార్దూలచర్మంబు జంకఁ జొనిపి,

తే॥గీ॥ పొమ్ము పొమ్మని యొకకొంత పోవఁ బోవ; రమ్ము రమ్మని మఱలఁ జేరంగఁ బిలిచి,
కపటనటనాపరుం డైనకంసవైరి బిరుసుముని నవ్వుటాలకుఁ బనులు గొనియె. —నంది తిమ్మన.

తే॥గీ॥ తెలుఁగదేల? యన్న, దేశంబు తెలుఁ, గేను దెలుఁగువల్లభుండఁ దెలుఁ గొకండ
యెల్లనృపులు గొలువ నెఱుఁగవే బాసాడి; దేశభాషలందుఁ దెలుఁగు లెస్స. —శ్రీ కృష్ణదేవరాయలు.

తే॥గీ॥ పలుచఁగా జూచు నెంతయు బంధుసమితి; పిలువఁ బిలువంగఁ బలుకరు బిడ్డలైన;
రచ్చ కెక్కెడు మాట గారాబుసతియు లెక్క సేయదు; లేమి తూలించెనేని. —మాదయ్యగారి మల్లన.

ఉ॥ కాముఁ గాల్చి, బూడిదను గంధముగాఁ గొని, యెద్దు నెక్కుచున్,
బాములు తోలు నెమ్ములుఁ గపాలములుం దనమేనిసొమ్ములుగాఁ
గాములఁ గూడి యాడుచును, గాడు గృహంబుగ నున్నవాఁడు గం
గాఒమృత మొదలం జిలికినంత సదాశివుఁ డయ్యె నెల్లెడన్. —కొరవి గోపరాజు.

ఆ॥వె॥ ఆవులింత తుమ్ము హాసంబు నిష్ఠీవనంబు గుప్తవర్తనములు గాఁగఁ
జలుప వలయు నృపతి కొలువున్న యెడల; బాహిరము లైనఁ గెలని కెగ్గు లగుట. —తిక్కన సోమయాజి.

చ॥ హరిణి యొకండు భూరమణబాణహతుండగు హేతువునన్ నిరుద్ధమౌ
హరిణముఁ జూచి తా మఱలి యడ్డుగ నిల్చును; బ్రాయికంబు దు
స్తర మగుఁ బో తనూవిరహతాపముకంటె సమస్తదేహసం
జ్వరకర మైననాథు నెడఁబా టొదవించెడి తాప మెంతయున్.

—ఆంధ్ర విష్ణుణ.

హేమంతఋతువులో వేటాడుచున్న రాజు ఒక మగలేడిని బాణముతో కొట్టగా ఆడులేడి ఆదెబ్బ తన ప్రియునకు తగులకుండగా అడ్డునిలిచెను. అది యుక్తమే కదా! ఎందుకనగా మరణమువలన జనించుతాపము నైనను ఓర్చుకొన వచ్చును గాని, ప్రియవియోగతాపమును సహించుట దుస్సాధ్యము. ఇది ప్రాయకముగా లోకములో ననుభవింపఁ బడుచుండును.

సీరియల్

# పంచతంత్రము

ఆ మాట విని హిరణ్యకుడు వెంటనే లఘుపతనకుని వీపుపైన ఎక్కెను. వాయసము తిన్నగా ఆ సరస్సును హిరణ్య కునితో చేరెను. మంథరకుడు దూరమునుండియే చూచి ఈ 'కాకి యెక్కడిదో? ఈ జంతువు సామాన్యమైనదికాదు.' అని నీటిలో దూరెను. లఘుపతనకుడు ఒకచెట్టుకోటరములో ఎలుకను ఉంచి చెట్టు కొమ్మపైన ఎక్కి బిగ్గరగా, 'ఓయీ! మంథరకా! రమ్ము రమ్ము. నేను నీ మిత్రుడను, లఘుపతనకుడను, చాలా కాలమునుండి నిన్ను చూడవలె నని కుతూహలపడి వచ్చినాను. వచ్చి నన్ను ఆలింగ నము చేసికొనుము." అని అనెను. ఆ మాట విని మంథరకుడు, 'అతడు తన మిత్రుడే' యని నిపుణముగా గ్రహించి వెంటనే నీటి నుండి బయలు వెడలి, సంతోషముతో నిట్లనెను:— "రమ్ము రమ్ము మిత్రమా! నన్ను కౌగలించుకొనుము, నిన్ను చూచి చాల కాల మైనందువల్లన గుర్తు తెలియక అనుమానముచేత నీటిలో దాగి తిని." అని చెప్పెను.

ఆమాటవిని లఘుపతనకము చెట్టునుండి దిగి మంథరకుని కౌగిలించు కొనెను. ఇట్లా యిరువురు మైత్రితో కలిసికొని చెట్టుక్రింద కూర్చొని తనతన వృత్తాంతములను చెప్పికొనిరి. హిరణ్యకుడుగూడ వారి దగ్గరకు వచ్చి మంథరకునకు నమస్కరించి వాయసము వద్ద కూర్చొనెను.



మంథ:—మిత్రమా! ఈ యెలుక యెవరు? నీకు ఆహారమైనవ దీనిని వీపుపైన ఎక్కించుకొని తెచ్చుటకు కారణమేమి? దీనికి గొప్ప కారణము ఉండును.

లఘు:—ఇతడు 'హిరణ్యకుడు' అనుమూషకరాజు. నాకు నీవలెనే ప్రాణమిత్రము. విరక్తిచేత నీకడకు వచ్చెను.

మంథర:— దీనివైరాగ్యమునకు కారణమేమి?

లఘు.—నేను ఇతనిని అడిగితిని గాని నాకు చెప్పలేదు. 'నీ కడకు పోయిన తరువాత చెప్పెదననెను.

అని చెప్పి వాయసము, 'హిరణ్యకా! ఇప్పుడు మా యిరువురికిని నీవైరాగ్య కారణమును చెప్పుము. 'అని అడిగెను. ఆ మాటకు హిరణ్యకుడు ఇట్లు చెప్పదొడగెను:—

దక్షిణ దేశమునందు 'మహిలారోప్యము' అను పట్టణము గలదు. దాని పరిసరమునందు పరమేశ్వరుని దేవాలయము ఉన్నది. అందులో 'తామ్రచూడుడు' అను సన్యాసి నివసించు చుండెను. అతడు ఆపట్టణమునందు బిచ్చమెత్తుకొని జీవయాత్ర గడపు చుం డెను. తినగా మిగిలిన భిక్షాన్నమును భిక్షాపాత్రములోనే ఉంచి ఆలయమునందలి ఒక చిలుకకొయ్యకు తగిలించి రాత్రి నిద్రించు చుండెను. మరునాడు ఉదయము ఆ అన్నమును పనివారలకు ఇచ్చి ఆదేవాలయమును ఊడ్పించి, అలికించి శుభ్రము చేయించు చుండెను.

ఇట్లుండగా నొకనాడు నాపరివారమువారు నావద్దకు వచ్చి 'స్వామీ! సిద్ధముగానున్న అన్నము ఎలుకలభయముచేత ఆలయములో చిలుకకొయ్యకు ఎల్లప్పుడు వ్రేలాడ గట్టబడి యుండును. దానిని మేము తినజాలకున్నాము. మీరు పోవజాలనిచోటు లేదు, కనుక వేరుచోటికి అన్నమునకై వ్యర్థముగా ఏల తిరుగవలెను? నేడు అక్కడికి పోయి మీయనుగ్రహమువలన యథేష్టముగా మన మందరము భుజింతముగాక. '' అని చెప్పిరి. ఆమాటలను విని నేను పరివారముతోపాటు వెంటనే అక్కడికి పోయితిని. ఎగిరి ఆ భిక్షాపాత్రముపైకి ఎక్కితిని. అచ్చటి అన్నమును నావారి కందరికి పెట్టి పిదప నేనును తిని నా నివాసమునకు పోవు చుంటిని.

ఇట్లు ప్రతిదినము అన్నము నష్ట మగుట చూచి ఆ సన్యాసి అన్నమును రక్షించు కొనుటకు ఎంతో ప్రయత్నము చేయుచు నన్ను కొట్టుటకు ఒక చీలినవెదురుకట్టనుగూడ తెచ్చి యుంచుకొనెను. నిద్రపోవుచుగూడ అత డప్పుడప్పుడు మేల్కొని ఆ కఱ్ఱతో భిక్షాపాత్రమును కొట్టుచుండెను. నేనును దెబ్బలకు భయపడి అన్నము తినకుండనే అక్కడినుండి తొలగి పోవు చుంటిని. ఈలాగు అతనితో పోరాడుచు రాత్రి యంతయు గడపు చుంటిని.

ఒకనాడాలయమునకు తామ్రచూడునిమిత్రుడు 'బృహత్స్ఫిక్' అనునొక సన్యాసి అతిథిగా వచ్చెను. అతనికి స్వాగతసత్కారములను చేసెను. ఆ రాత్రి ఆ యిరువురు కుశాస్తరణమునందు శయనించి యిష్టాగోష్ఠి జరుపుకొను చుండిరి. మధ్యమధ్య తామ్రచూడుడు అతిథి మాటలకు పరాకుగా బదులు చెప్పుచు భిక్షాపాత్రమును కొయ్యతో కొట్టు చుండెను. తన ప్రశ్నమునకు సరియైన సమాధానము రాకుండుట చూచి ఆ యతిథి కోపముచేత ' ఓయీ ! తామ్రచూడా! నీవు మంచి మిత్రుడవు కావని తోచుచున్నది. నీవు నాతో సంతోషముగా మాట్లాడుట లేదు, అందుచేత నిన్ను వీడి ఈ రాత్రియే నేను వేరుచోటికి పోయెదను. మఠాధికారము లభించగనే

గర్వితుడవై మిత్రస్నేహమును విడిచితివి కనుక నేను ఈ మఠమును విడిచిపోయెదను' అని చెప్పెను.

ఆమాటలు విని తామ్రచూడుడు భయపడి "మహాత్మా! అట్లనకుము. నీతో సమానుడైన మిత్రుడు నాకు మరి యొకడు లేడు." అని చెప్పి అతనితో పరాకుగా మాట్లాడుచుండినందుకు కారణమిది యని జరిగిన సంగతి యంతయు నతనికి చెప్పెను.

బృహత్స్ఫిక్:—ఆ యెలుక బిలమెక్కడ నున్నది నీవెరుగుదువా?

తామ్ర:—మహాత్మా! బాగుగా ఎరుగను.

బృహ:—అతని బిలము నిశ్చయముగా నొక ధనరాశిపై నుండును. ధన గర్వముచేత ఆ యెలుక యింతపైకి ఎగుర గలుగుచున్నది. అట్లుగాకున్న దానికి బలము వచ్చియుండదు. కారణము లేక కార్యము పుట్టదు. దీనికొక కథచెప్పెదను వినుము:—

ఒకప్పుడు నేను వర్షాకాలములో చాతుర్మాస్యవ్రతము (వానకాలములో సన్యాసులు తిరుగుట మాని ఒక చోటనే నియమముగానుండు వ్రతము) జరుపుటకు ఒక గ్రామములో ఒక బ్రాహ్మణుని నివాసస్థాన మిమ్మని కోరితిని. అతడంగీకరించి నాకుస్థానమిచ్చి నన్ను సేవించుచుండగా నచ్చటనే సుఖముగనుంటిని. ఒకనాడు ఉదయము నేను మేల్కొని ఆ బ్రాహ్మణ దంపతులీ క్రింది విధముగా మాట్లాడు కొనుచుండుటను వింటిని:—

బ్రాహ్మణుడు:—నేడు దక్షిణాయన పుణ్యకాలము కనుక ఏదైన దానము తెచ్చుకొనుటకు గ్రామాంతరము పోవుచున్నాను. నీవు సూర్యుని ప్రీత్యర్థమై నేడొక బ్రాహ్మణుని పూజించి భోజనము పెట్టుము.

బ్రాహ్మణి:— (కోపించి) దరిద్రుడవగు నీకు ఇతరులకు అన్నదానము చేయుశక్తి యెక్కడిది? నీకు సిగ్గు లేదా యిట్లుచెప్పుటకు. నిన్ను కట్టుకొని నేను కించిత్తుగూడా సుఖ మనుభవించలేదు, ఒకనాడైనను మంచితిండి, బట్ట, సొమ్ములుగాని నాకు నీవు ఇవ్వలేదు.

బ్రాహ్మణుడు:—ఇట్లునీవు అనకూడదు. దారిద్ర్యము అనుభవించుచుగూడా మనము ఉన్నదానిలో కొంచెమైనను పుణ్యకాలములో సత్పాత్రకు దానము చేయవలెను, అత్యాశ ఉండగూడదు, దానివలన నాశము కలుగును. ఈ విషయములో నీకొక కథ చెప్పెదను వినుము:—

'పూర్వమొక వనమునందు ఒక పుళిందుడు (అడివిజాతివాడు) ఉండెను. అతడు హింసించి ధనమును సంపాదించుటకై వనములో తిరుగుచుండెను; అచ్చట అతని కొక పంది కనపడెను. అది కాటుకకొండవలె నల్లగా పెద్దగా నుండెను. దానిని పుళిందుడు బాణముతో తీవ్రముగా కొట్టెను. అది దెబ్బ తిని కోపోద్రేకముచేత వానిపైన బడి చంద్రరేఖలవంటి తన కోరలచేత వాని పొట్ట చీల్చి చంపెను. కాని, పందికూడ వాని బాణపుదెబ్బచేత చచ్చి అచ్చటనే పడిపోయెను.

ఇంతలో ఒక నక్క ఆకలిబాధచేత మరణావస్థ ననుభవించుచు అక్కడికి వచ్చి ఆరెండు శవములను జూచి సంతసించెను. ఈ యాహారము నాకు భగవంతుడు స్వయముగా ప్రసాదించెను. ఇది నాకు చాలకాలమువరకు ప్రాణాధారక మగును. ఈ నాటికి మాత్రము ఈ ధనుస్సుకు అల్లెత్రాడుగా కట్టిన నరమును తినెదను. అని వంకరగానున్న ఆ ధనుస్సుకొనకు కట్టబడిన నరమును కొరికెను. ఆ కట్టుతెగి వెదురుకఱ్ఱ నక్కనోటిని చీల్చి శిఖవలె తలపైకి దూరిపోయెను, ఆ బాధతో నక్క వెంటనే చచ్చిపడెను.

అందుచేత అత్యాశ పనికిరాదు. మనకు లభ్యమైనదానితో తృప్తిచెంద వలెను, ఉన్నదానిలో కొంతదానము చేయ వలెను,

బ్రాహ్మణి:— అట్లైనచో, మన యింట్లో కొంచెము నువ్వు ఉన్నవి, పొట్టు ఒలచి తిలపిష్టముచేత నేడు బ్రాహ్మణునికి భోజనము పెట్టెదను.

ఆమాటకు బ్రాహ్మణుడు సంతసించి గ్రామాంతరమునకు పోయెను.

బ్రాహ్మణి తిలలు పొట్టు ఒలచి యెండలో ఆర బోసియుండెను, ఆమె పని చేసికొనుచు ఇంటిలో నుండగా, ఒక కుక్క వచ్చి ఆ నువ్వులలో మూత్రము చేసెను. దానిని చూచి, "అయ్యో! దైవ మెంత ప్రతికూలముగా నున్నది? ఈ తిలలు తినరాకుండ అయినవి, కనుక నేను ఈ ఒలిచిన నువ్వులను ఎవరింటికైనను కొనిపోయి యిచ్చి వీటికి బదులుగా ఒలువనినువ్వులను తెచ్చుకొనెదను, ఎవరైనను ఈ లాభమునకు అంగీకరించెదరు. అని వాటిని మార్చుటకు ఒక యింటికి తీసికొని పోయెను. ఆ యింటికే నేనుగూడ భిక్షార్థమై పోయియుంటిని. అని బృహత్స్ఫిక్ తామ్రచూడునితో చెప్పదొడగెను, ఆ ఒలిచిన తిలలను తీసికొని వాటికి బదులుగా పొట్టునువ్వులను సంతోషపూర్వకముగా వినిమయము చేయుటకు ఆ యింటిగృహిణి ప్రయత్నించుచుండెను. ఇంతలో ఆమెకొడుకువచ్చి, అమ్మా! కారణము లేక యిట్లు నష్టకరమైన మార్పు ఎవ్వరును చేయరు కనుక. నీవు ఈ నువ్వులు పుచ్చుకొనవద్దు" అని నివారించెను,

పై కథ చెప్పి బృహత్స్ఫిక్కు తామ్రచూడా! ఆ యెలుక వెడలిపోవు మార్గమును తెలిసికొన వలెను, అని చెప్పెను.

తామ్ర:—మహాత్మా! తెలియును. అది ఒక్కటిగా రాదు. పరివారముతో వచ్చును. నేను చూచుచుండగనే వెడలిపోవుచుండును.

బృహ:—నీవద్ద గడ్డపార ఉన్నదా?

తామ్ర:—ఒక యినుప గుదియ ఉన్నది.

బృహ:—అట్లైన మన మిరువురము ఆ యెలుకల అడుగులగుర్తులను బట్టి ఆ బిలము చేరుదము.

ఈ మాటలు విని నేను (హిరణ్యకుడు) 'అయ్యో! ఈ దుష్టసన్యాసి ప్రసంగవశమున నాధనరాశిని తెలిసికొనెను. ఇప్పు

డీయుక్తిచే నా బిలమునుగూడ కనుగొన మన్నాడు," అని భయపడి అతనికి బిలము తెలియకుండుటకుగాను, నా బిలమార్గమును వీడి అన్యమార్గముగుండా నాపరివారముతో పోవుచుంటిని'' అని. హిరణ్యకుడు లఘుపతనక మంథరకులతో చెప్పి తరువాతి వృత్తాంతము నిట్లు చెప్పదొడగెను:_అట్లు అన్యమార్గముగుండా పోవుచున్నమా పైన ఒక పెద్దపిల్లి వచ్చిపడి అనేకమూషికములను చంపి తినెను. చావగా మిగిలిన యెలుకలు 'నేను చెడ్డత్రోవలో తమను తోడుకొని పోవుచున్నానని నన్ను నిందించుచు పూర్వపు బిలమునకే పోయి చేరెను. నే నొక్కడనే వేరుచోటికి పోయితిని.

అప్పుడా దుష్టసన్యాసి యెలుకలనెత్తుటియడుగులగుర్తులనుబట్టి బిలము చేరి గునపముతో బిలము త్రవ్వి నా ధనమంతయు హరించి వెడలిపోయెను. తిరిగి నేను మరునాడు ఆభిక్షాపాత్రము పైకి ఎగురబోయితిని గాని విత్తనాశముచేత ఉత్సాహహీనుడనై దానిపైకి ఎగురలేక పోయితిని. అప్పుడాదుష్టసన్యాసి, తామ్రచూడునకు నా అవస్థను చూపి "ధననాశముచేత జంతువులకు గలుగు దురవస్థను చూచితివా" అనిచెప్పెను.

అప్పుడు నేను పేదతనము చాల దుర్భరముకనుక ఎటులైనను తిరిగి ధనము సంపాదించవలె నని తిరిగి ఆ మఠమునకే పోయి సన్యాసి తలక్రిందపెట్టుకొని యున్న ధనపేటికను మెల్లగా కొరికి ధనమును అపహరించ జూచితిని, కాని అతడా శబ్దముచే మేల్కొని నన్ను వెదురుకఱ్ఱతో తలపై మోదెను అదృష్టవశాత్తు బ్రతికి బయటపడితిని.

కనుక మిత్రులారా! మనకు రావలసిన ధనమే అబ్బును. దానిని తప్పించుటకు దేవతలకుగూడ సాధ్యము కాదు. ఏది మనదో. అది యితరుల కెప్పుడును పోవదు. కనుక ధనము చేరినప్పుడు సంతోషముగాని, అది నశించినప్పుడు దుఃఖముగాని నాకు లేదు. ఈ విషయములో మీ కొక కథ చెప్పెదను వినుడు, అని హిరణ్యకుడు కాక కూర్మములకీ క్రింది కథ చెప్పదొడగెను— (సశేషము)

---

(26వ పేజీ తరువాయి)

ప్రకృతిమాత తన ఒడిలోని పంటలనన్నిటినీ కర్షక కార్మిక గృహాలలో దిగవిడిస్తుంది. గాదెలు, గంపలు గరిసెలు, పాతర్లు, నవధాన్యాలతో నిండిపోతాయి. మళ్ళీ భూమాతను, చేరి సేవించడానికి కొంతవిరామం చిక్కుతుంది రైతులకు తమ కృషి ఫలితాన్నిచూచి మురిసి పోతుంటారు వారు. అప్పుడు వస్తుంది సంక్రాంతి. తోటలో పూసిన గుమ్మడిపూలను కోసి ప్రియురాలి సిగలో తురుముదామని గ్రామ్యజనునికి బుద్ధి పుడుతుంది. పొలం పని మాని వంటకం రుచిగా వండి ప్రియునికి వడ్డించడానికి కార్మిక వనితకు అవకాశం లభిస్తుంది. గొఱ్ఱెలకాపరికి తన మందపంట పొలాల్లో పడుతుందన్న భయంపోయి, ఇల్లాలినీ ఇంటినీ చూచుకోవడానికి ఊళ్ళోకి అప్పుడప్పుడూ వస్తూవుంటాడు. గొల్లపడుచూ చద్దిమూటను గొర్రెల మందవద్దకి మోసుకపోయే అవసరం తగ్గిపోయి, ఇంట్లోనే ప్రియుని కంచంలో వడ్డించే తీరిక చిక్కుతుంది, అప్పుడువస్తుంది సంక్రాంతి. వారందరూ దానికి స్వాగతం పలుకుతారు. ఇండ్లు ముంగిళ్లూ అలుక్కుంటారు, ఇంటిలోని వస్తువులు శుభ్రపరుచుకుంటారు. ఇళ్ళ ముందర పచ్చిరాని ముగ్గులను గొబ్బెమ్మలనూ పెడతారు, తలంట్లు పోసుకుంటారు, కొత్త బట్టలు కట్టుకుంటారు, కొత్త పంట తింటారు. ఎద్దులను, బండ్లలను అలంకరిస్తారు. చిన్నలు పెద్దలూ బండ్లనిండా ఎక్కుతారు. పొలిమేరల ప్రాంతంలో ఉన్న గ్రామదేవత సన్నిధికి బండ్లను తోలుకపోతారు. దేవతలు తమ కోర్కెలు తీర్చాలని సాగిలబడి మ్రొక్కుతారు. కొండమిదవున్న వెంకటేశ్వరస్వామికి భోగిమంటలు, దీపాలు సమర్పిస్తారు. దేవుళ్ళకు పెద్ద పెద్ద గుమ్మడికాయలు సమర్పిస్తారు. సాయంకాలం దేవాలయం ముందు కూర్చున్న పురోహితుని వద్దకి గ్రామవృద్ధులు, పలుకుబడిగల ఆసాములువచ్చి సంక్రాంతి పురుష లక్షణం. దానివల్ల దేశానికి వచ్చే మేలు కీళ్లూ వివరంగా చెప్పమని కోరుతుంటే అందులో ప్రజలు కూడా పాల్గొంటారు. పురోహితుడు పంచాంగం విప్పి చెప్పే వివరాలు ఆలకిస్తారు. ఈ సంవత్సరం వచ్చిన సంక్రాంతి పురుషునికి మూడుతలలు, రెండుముఖాలు, నాల్గునోళ్లు, మూడుకళ్లు, అయిదు రంగులు, ఎఱ్ఱని దంతాలు, పొడుగ్గా వ్రేలాడుతున్న కనుబొమ్మలూ, ముక్కూ, ఎనిమిది చేతులు, రెండుకాళ్లు, నల్లని రంగు, నూరు యోజనాలయెత్తు, పన్నెండుయోజనాల వెడల్పు' పేరు రాక్షసుడు, అని చెప్పుకపోతుంటే భయభ్రాంతులై ఒకరినొకరు చూచుకుంటారు. దీనికేంఫలమో! అని సంశయపడుతుంటారు. మరి దీని ఫలిత మేమిటండీ ? అని అనుభవజ్ఞులు ప్రశ్నించినప్పుడు, సంక్రాంతి పురుషుడు నిర్మలోదక స్నానం చేశాడు. కనుక దేశానికి సుఖప్రదం అని పురోహితుడు చెప్పినప్పుడు అందరి ముఖాలు ఒక్కసారి వికసిస్తాయి, బొంతను కట్టుకన్నాడు. కనుక మహాభయం అనగానె ఆఁ, అలాగా అనుకుంటారు. కర్పూరగంధం పూసుకున్నాడు కనుక విషవస్తు నాశనం అన్నప్పుడు మంచిదే లే అంటారు చంపక పుష్పధారణం మనోవ్యాకులత అన్నమాటకు ఎవరిమనస్సు, నిర్మలంగా ఉంది లే అని తృప్తిపడ్తారు. కంబెను ఆభరణంగా. పెట్టుకోవడం సస్యనాశనం అనగానే వేసంగిపంటలు ఏమవుతాయో అని ఉల్లిక్కి పడుతారు. పాషాణ పాత్రలో భోజనం కనుక వ్యాధి నాశనం, బెల్లము ఆహారం కనుక ఆకలి, ఇత్యాది శుభాశుభ ఫలాలు చెప్పుకు పోతూ వున్నప్పుడు తత్త్ద్విధములయిన భావ వికారాలను, వెల్లడిస్తూ చివరికి పురోహితునికి తాంబూలనమస్కారాలు సమర్పించి, దగ్గరఉన్న కోవెలలోనికి వెళ్లి దేవతాదర్శనం చేసుకుంటారు. దుష్టఫలితాలను నివారించి శుభ ఫలితాలను చేకూర్చమని దేవున్ని ప్రార్థిస్తారు. ఇండ్లకు తిరిగివెళ్లి రాత్రి భోజనాలు చేసి కోలాటం, గొబ్బిళ్లు, బొమ్మలాట, మొదలైన వినోదాలతో కాలంగడుపుతారు. అలాగడుస్తుంది సంక్రాంతిపండుగ పల్లెసీమలలో. పండుగ మరునాడు కరిపండుగ ఆరోజు ఏవిధమైన శుభకార్యమూ చెయ్యరు. చివరికి ప్రయాణం కూడా చెయ్యరు. అదిశాస్త్రసమ్మతమైన వృద్ధాచారం అదే గ్రామజనుల ఆచారంకూడాను.

సంపన్న గృహస్తుడు మొదలుకొని సాతావిజియ్యరు వరకూ పెద్దరైతు మొదలుకొని పేదకూలి వరకు పురోహితుడు మొదలుకొని బిచ్చగాని వరకూ, సంతోష ప్రదమైన సంక్రాంతి పండుగ నాడు జరిగే ఉత్సవ విశేషం శాస్త్రసమ్మతినీ జనసమాదరాన్నీ పొందినట్టిది. భారతీయ సంస్కృతికి ఇది ఒక అద్భుతమైన చిహ్నం.

# వేదములు - అలంకారములు

యం. బాలవిశ్వనాథ శర్మ

ప్రత్యక్షేణానుమిత్యా వా యస్తూపాయో న బుధ్యతే ।
ఏనం విదంతి వేదేన తస్మాద్వేదస్య వేదతా ॥

వేద మను పదము 'విద' ధాతువునుండి పుట్టినది. ఇది సర్వ విజ్ఞాన రాశికి పుట్టినిల్లు. సృష్టికి పూర్వము నుండి ఉన్నది. విలయము తరువాత కూడ ఉండ గలదు. ఇది నిర్వివాదము. సర్వ శాస్త్రములు, మంత్రములు, తంత్రములు, సర్వ ప్రక్రియా భేదములన్నియు శ్రుతిదృష్టము లే. సర్వజన సమ్మోహకరమైన కళాశాస్త్ర ప్రశస్తి యంతయు వేదమునుండియే ఉద్ధరింపబడినది. అర్థము, పరమార్థము, లౌకికాలౌకికములైన ఆనందానుభూతులు వేదగమ్యములై భాసిల్లుచున్నవి. వేద విషయమున అర్వాచీనుల మతము వేరుకావచ్చు. బహుశః అందుకు కారణము వారి ప్రాక్తన సంస్కారమయి యుండవచ్చు. అంత మాత్రమున వేదములకు కల్గిన చ్యుతిగాని, మంత్రద్రష్టలైన ఋషులకు కల్గిన పరాభవముగాని ఏమియులేదు. రాగులకు విరాగులకుకూడ వేదము చేయూతనిచ్చును. ప్రత్యక్షానుమాన ప్రమాణములచేత బొందవీలుగాని ప్రయోజనమును ప్రసాదించునదే వేదముగనుక దానికదే సాటి. అది నిత్యవర్తి, అపౌరుషేయము. ఈ మాట శిష్టాభిమతము. ఇందులో తద్విధుల కెన్నడును అభిప్రాయము భేదించలేదు. వేదమునకు సంబంధించిన అపౌరుషేయత్వ చర్చ ఇక్కడ అప్రకృతము.

వేదము ప్రభుసమ్మితమని పెద్దలనినారు. ప్రభువు ధర్మాధర్మ విచక్షణమున, న్యాయాన్యాయ విచారణమున స్వపర భేదమును పాటింపడు. అంతటను సముడై మెలగును. వేదము ప్రభుసమ్మితమే అయినను పాత్రాపాత్ర విచక్షణ కలది. వేదము శాస్త్ర ఫణితిని మనస్సునందుంచుకొని హితము నుపదేశించినది. మంత్రభాగము నందు, అర్థవాదమునందు, ఉపనిషద్ద్వయమందు ప్రయుక్తమైన పదబంధమే అందలి పాత్రాపాత్రవివేకమును తెలియజేయు చున్నది. జ్ఞానులకు ఉపదేశించవలసిన విధమువేరు. అజ్ఞానులకు ఉపదేశించవలసిన విధమువేరు. ఆ యా మనుష్యుల తారతమ్యము ననుసరించి హితము నుపదేశించుచు అహితమును తొలగించినది.

వేదవాఙ్మయమున అనేక ప్రాచీన కథలు లభించును. ఇవియే కాలాంతరమున రూపాంతరమును బొందినవి. సంభాషణ ప్రతి సంభాషణ రూపమయిన ఇతివృత్తము లనేకములు విచిత్ర ముగ లభించుచున్నవి. ఈ వృత్తరీతులే కాలక్రమమున దృశ్య కావ్యరూపమైన నాటక వాఙ్మయముగ విస్తృతి నందినది. సంగీత శాస్త్రము, అందులోని స్వర ప్రక్రియా భేదములు సామవేదము నుండి సముద్భవించినవి.

ఇక నిర్మాణకల్పనము, పరిమాణ విభాగము, శిల్పవాస్తు కర్మలు పరాకాష్ఠ నందినవి. ఈ భాగములే ఉత్తర కాలములో గ్రామములు పట్టణములు సౌధములు మహా చైత్యములు మున్నగు వానిని నిర్మించుటయందు తోడ్పడియుండును. ఈ ఊహ కాధార ములు సాధారణముగ వేదములలో లభించుచున్నవి. ఈ విధముగ పరిశీలించినచో వేదాంగములైన వ్యాకరణ న్యాయ మీమాంసాది శాస్త్రములకు, సంగీత, చిత్రలేఖన, శిల్పాది కళలకు బీజ ప్రాయములైన వస్తువులన్నియు వేదములలోనే లభించుచున్నవని తెలియుచున్నది.

కళ వేదాంగముగ గోచరించుచున్నది. కళ ఎప్పుడును సాకారము. అందుకే అది మహానందమునకు పరమావధికాదు. "సఏకో మనుష్య గంధర్వాణా మానందః" అను ఉపనిషత్సూక్తి ననుసరించి కళ సాకారముగ ఉన్నంతవరకు మనుష్యుని సంతోష పరచి కొంత కాలము తన్మయుని చేయును. అదే నిరాకారమైనచో బ్రహ్మానందమును గలిగించి శాశ్వత సుఖమునకు ఆధారమగును.

మొత్తము మీద మానవుడు నిత్యానంద స్థితిలో నుండ వలయునని ఎల్లప్పుడు కోరుచుండును. ఇందుకు సాహిత్య మవసరము. వేదశాస్త్ర పురాణాదులతో పొత్తులేనివాడు అకించనుడై కాంతా సమ్మితమైన కావ్యము నాశ్రయించును. కావ్యము సాహిత్య ప్రజ్ఞా ప్రదర్శనకు ఆదర్శము. సంగీతములో సంగీతకళ, చిత్రలేఖనమున తత్కళ, నాట్యమున నాట్యకళ, శిల్పములో శిల్పకళ కనిపించుచుండును. ఇది సహజము. కాని సాహిత్యము సర్వకళ లను సంతరించుకొన్నది. "సాహిత్యం సర్వకళాత్మకం" అనిన చాలునేమో ! ఇట్టి సాహిత్య సమారాధనము కొంత ఆత్మానందము నిచ్చును. ఈ శాస్త్రమున ప్రధాన విభాగ మలంకారము. అలంకారము నిజముగ అలంకారమే. అలంకారానుభవము కొరకే ప్రాణి జన్మించును. ప్రాణి కొఱకే సర్వము అలంకృత మగును. అనిన, అలంకారమునకున్న ప్రాధాన్యము విదిత మగును.

ఈ అలంకార శాస్త్రబీజములు తదుదాహరణములుకూడ వేదమున మున్నవి. వాని నన్నింటిని ఉదహరింప నలవిగాదు. కొన్ని కొన్ని మాత్రము ఉదహరింపబడుచున్నవి:—

సంహితా భాగములో;

"ఘృతంపీత్వా మధుచారు గవ్యంపితేవ
పుత్ర మభిరక్షతాదిమమ్"

అను మంత్రమునందు పవిత్రము సుందరమునయిన ఉపమానము వాచ్యమై కనబడుచున్నది. ఈ ఔపమ్య భావమే సాహిత్యమున ఉపమాలంకారముగ పరిణమించినది. ఈ ఔపమ్యమసాధారణముగా అనేకాలంకారములకు మూలము.

ఉపనిషత్తులలో మరొక మంత్రము.

*"ఆకాశాద్వాయుః । వాయోరగ్నిః ।*
*అగ్నేరాపః । అద్భ్యః పృథివీ ।*
*పృథివ్యా ఓషధయః । ఓషధీభ్యోన్నం ।*
*అన్నాత్పురుషః ॥* అని యున్నది.

శంకరాచార్యులవారు భజగోవిందస్తోత్రములో.

*"సత్సంగత్వే నిస్సంగత్వం,*
*నిస్సంగత్వే నిర్మోహత్వం,*
*నిర్మోహత్వే నిశ్చల తత్త్వం.*
*నిశ్చల తత్త్వే జీవన్ముక్తిః"*

అని చెప్పినారు, పై రెండు గ్రంథ భాగములలోను వాక్యములలో ఉత్తరోత్తరమునకు పూర్వ పూర్వము కారణమై కారణమాలాలంకారమునకు మూలముగ కనిపించుచున్నది,

*"తస్యైవం విదుషో యజ్ఞస్యాత్మా*
*యజమానశ్శ్రద్ధా పత్నీ శరీర*
*మిధ్మమురో వేదిర్లోమాని బర్హిః"*

అను మంత్రములో కనబడు రూపణము రూపకాలంకారమునకు మూలమనవచ్చును.

*"ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా ।*
*లోకేధర్మిష్ఠం ప్రజా ఉపసర్పంతి ।*
*ధర్మేణ పాపమపనుదతి ।*
*ధర్మే సర్వం ప్రతిష్ఠితం।*
*తస్మాద్ధర్మం పరమం వదంతి॥*

ఈ శ్రుతి వాక్యము సహజోక్తితో నొప్పినది కనుక 'స్వభావోక్తి' అలంకారమునికిది మూలముగా కనబడుచున్నది.

1. *"యథా పుత్రః పితరం శీత ఉపధావతి*
*తాదృగేవ తదాత్మా వా ఏష య యజ్ఞస్య॥*

2. *యథా నద్యస్స్యందమానాస్సముద్రే ॥*

3. *"యథోర్ణనాభిస్సృజతే గృహ్ణతే చ ॥*

ఈ వేదవాక్యములు దృష్టాంతములను సంతరించుకున్నవి. కనుక ఇవిదృష్టాంతాలంకారమునకు మూలములనవచ్చును.

*"మాఛందః ప్రమాఛందః*
*ప్రతిమాఛందో శ్రీవిశ్ఛందః*
*పజ్తిశ్ఛంద ఉష్ణిఛందః ॥*

ఈ మంత్రము శబ్దాలంకారమైన వృత్త్యనుప్రాసతో కూడియున్నది. ఈరీతిగ శ్రుతులలో అలంకారోదాహరణము లనేకములు కనబడుచున్నవి. ఇట్లే శయ్యాపాకములు ఇతర కావ్యాంశములు శబ్దవృత్తి లక్షణాబీజములుకూడ వేదములలో లభించుచున్నవి.

నేటి వైజ్ఞానిక యుగములో ప్రధానముగ పేర్కొనదగిన అణు శక్తికికూడ శ్రుతి వాక్యములే ప్రధానాధారములని తద్జ్ఞులుకూడ అంగీకరించినారు. ఈ మంత్రమును చూడుడు.

*"తస్యాంతే సుషిరగ్ం సూక్ష్మం తస్మిన్ సర్వం ప్రతిష్ఠితం ।*
*తస్యమధ్యే మహానగ్ని ర్విశ్వార్చి ర్విశ్వతోముఖః॥*

విద్యుత్ప్రధానములైన అంశములుకూడ ఈ మంత్రములో వినబడుచున్నవి.

ఈ విధముగ వేదములప్రభావము పాంచభౌతికమయిన జగత్తునందు ప్రతి అంశమునందును స్థానము నేర్పరుచుకొనినది. సర్వ విజ్ఞాన శాస్త్రమునకు, సకల కళా శాస్త్రమునకు ఇతర వేదాంగములకు వేదము ప్రముఖమైన ఆలంబనముగా భాసిల్లుచున్నదని చెప్పవచ్చును.



సీరియల్ :

# గృహిణి

**పిలకా గణపతిశాస్త్రి**

రాత్రి పదిగంటలు దాటిన తర్వాత విజయహాలులో రాఘవ నాట్య కళామండలి ఆధ్వర్యంలో శ్రీకృష్ణ తులాభారం ప్రారంభమయింది. ఆ పట్టణంలో అంతకు మునుపు ఆ నాటకం ప్రదర్శనలు కొన్ని జరిగినా రాఘవ నాట్య కళామండలి ఆధ్వర్యంలో జరగ డాని దే మొదలు ఆ రోజుల్లో స్త్రీలంత బాహాటంగా రంగస్థలం మీదికి రాలేదు. ఆ ప్రదర్శనంలో అంతాకలిసి అయిదారు గురు దాకా నటీమణులు పాల్గొంటు న్నారు. ఆనాడు ప్రేక్షకులంతా ఎక్కువగా హాజరుకావడానికి అదీ ఒక ప్రధాన కారణమే! అదే గాక రాఘవ నాట్య కళామండలి మొట్టమొదటగా పెద్ద ఎత్తున ఆ నాటకం ప్రదర్శిస్తున్నది దాని పన పరిశీలించాలన్న తహతహతో కూడా ప్రేక్షకులా ప్రదర్శనానికంత ఎక్కువగా హాజరయినారు.

మరికొంత సేపటికి ఇందు మించుగా మొట్టమొదటి అంకం ముగియ వచ్చింది. కాని ప్రేక్షకులా సించినంతగా నాటకం రక్తి కట్టలేదు. పార్థసారథి, రాఘవ మిగిలిన నటీ నటులందరిని జాగ్రత్తగా కూడగట్టుకుని అయిదారుసారులు పూర్తిగా రిహార్సల్స్ కొనసాగించారు. ఇంకా ఇంకొకసారి విజయహాలులో స్టేజీ మీద కూడా రిహార్సల్ జరిపారు. నిజానికి వారుచేసిన ఏర్పా ట్లలోగాని, మిగిలిన హంగామాలలోగాని ఏవిధమైన కొరవ కలగ లేదు అయినా నాటకం అనుకున్నంత చక్కగా రక్తి కట్టకపోవ డానికేమికారణమో రాఘవకి బోధపడలేదు.

కాని తెరవెనకాల నిలుచున్న పార్థసారథిమాత్రం దానికొక విధంగా సమాధానం చెప్పుకుని సంతృప్తి పడ్డాడు. మొత్తం నాటకంలో ఉన్న మూడంకాలలోను మొదటిదానిలో అంత పట్టయిన ఘట్టమేదిలేదు. తెర ఎత్తగానే కలహ భోజనుడు నారదుడు స్వర్గరాజధాని అమరావతిలో ప్రవేశిస్తాడు. ఆ పైన దేవేంద్రుని అంతఃపురంలో అడుగుపెట్టి అమరపతి పూజ లందు కుంటాడు. శచీ దేవేంద్రుల ముఖాలలో దుఃఖం గమనించి శ్రీ కృష్ణుని పారిజాతాపహరణం వల్లనే వారికంతటి దుస్సహ దైన్యం కలిగినదని ప్రత్యుత్తరాలవల్ల గ్రహించి చల్లని మాట లతో ఓదారుస్తాడు. పారిజాతం తిరిగి శచీదేవికి దక్కించగల నని వాగ్దానం చేస్తాడు. దానితో సత్యభామ గర్వంకూడా పూర్తిగా అణిగిపోగలదని గట్టిగా భరవసా ఇస్తాడు. అంత కన్న తమకిద్దరికి వేరే కోరుకోవలిసినదేమి లేదని దేవేంద్రుడెంతో వినయముతో విన్నవించుకుంటాడు. దానితో మొదటి అంకం ముగిసి పోతోంది. ఏవేవో కొన్ని పాటలు, పద్యాలు తప్ప దానిలో అంతగా రక్తి కట్టించేవి ఏవి లేవు. నిజానికి ఆ అంకంలో కథకి అంతటికి అవసరమైన గట్టి పునాది మాత్రమే పడుతుంది. అంతే.

నారదవేషం వేసిన రాఘవ చది విన పద్యాలు, పాటలు మొత్తంమీద బాగానే ప్రశంస లందుకున్నాయి. శచీ దేవి వేషం వేసిన చిట్టెమ్మగాని, ఇంద్రి వేషం వేసిన వెంకయ్యగాని అమాత్ర మయినా నటించగలరని ఎవ్వరు ఎదురు చూసి ఉండరు. వారిద్దరు, బృహస్పతి వేషధారి అట్టే అప్రతిష్టపాలు కాకుండా ఏలాగో అలాగ మాట దక్కించుకుని బయటపడ్డట్టే! అంతమాత్రానికే నిరు త్సాహ పడవలసిన అవసరం ఏమి ఉంది!

ఇక ద్వితీయాంకంలో తను, సరోజ, విదూషక వేషం వేసే వెంకటనారాయణ మేష్టరు రంగస్థలంమీద అడుగు పెట్టిన తరవాత నాటకం మంచి రసకందాయంలో పడి తీరుతుంది! మరి సందేహంలేదు! అందుచేతనే పార్థసారథి తన కృష్ణవేషం చక్కగా సరిదిద్దుకుని రంగస్థలం మీదికి ఉరకడంకోసం ఎప్పు డెప్పుడని ఎంతో ఆత్రంగా నిరీక్షించాడు. ఆలోగా స్టేజీమీద ఉన్న నటీ నటుల కందరికి కావలిసిన హంగులన్ని ఎప్పటికప్పటికి త్వరగా అందేటట్టు జాగ్రత్తపడ్డాడు. మరి కొంత సేపటికి మొదటి అంకం ముగిసింది.

వెనువెంటనే సోడాలు కొట్టిన ధ్వనులు, సవ్వడులు, కిళ్ళీలు బీడీలు, చుట్టలు, సిగరెట్లు అమ్మేవారి కేకలు హాలులో నాలుగు మూలల ప్రతిధ్వనించాయి. క్రమక్రమంగా ప్రేక్షకుల సంభాష ణల కోలాహలం చెలరేగింది. స్టేజిమీద పెట్టిన గాస్ లైట్లచుట్టు ఏవేవో చిన్న చిన్న పురుగులు కొన్ని తిరిగాయి. పోను పోను మొదటి అంకం చిట్టచివర నాటకం ప్రేక్షకుల నందరిని కొంత వరకు ఆకట్టింది. అది ముగిసేముందు నారదుడు చదివిన 'అక్క మలాక్షు డాత్మతరకాక్షుల దక్కిన వారికంటె' అన్న పద్యం విన్న ప్రేక్షకులలో వన్స్ మోర్ కేకలదేపనిగా విజృంభించాయి. రాఘవ తిరిగి పద్యం చదివేపద్ధతి పెట్టుకోలేదు కాని, మరి గత్యం తరం లేక ఆ పద్యం అంతా మళ్ళీ అదే భైరవిరాగంలో ఆలా పించి, చక్కగా భావయుక్తంగా అభినయించి సెహబాస్ అని పించుకున్నాడు. దానితో పార్థసారధి మనస్సులో నాటకాన్ని గురించి మరి భయపడ నక్కరలేదన్న ధీమా కలిగింది. బాగా ధైర్యం పుంజుకుంది.



తెరమీద రామపట్టాభిషేకం చిత్రం కాళ్ళకింద సాలీడు అటు, ఇటు మెదిలింది. కన్నులరమోడ్చి చేతులు రెండు జోడించిన వీరహనుమానుని మూర్తి క్రీగంటితో ప్రేక్షకులనందరిని పరిశీలిస్తున్నట్టు కనబడింది. వెనకాల నటీ నటులు చేసుకుంటున్న ఏర్పాట్లతో తెర కొంచెం కదిలింది. సాలీడు కంగారుపడి తొందరగా ఇంకొక మూలకి పరిగెత్తింది. రంగస్థలంలో కుర్చీ లటు ఇటు కదలిన ధ్వని స్పష్టా స్పష్టంగా వినిపించింది.

మొదటి తరగతి మూడవ వరసలో కూర్చున్న ప్రేక్షకులలో చాలా మంది నటీ నటుల నెరిగినవారు. మిగిలినవారికి వారి సంగతులంతగా తెలియదు. అయినా ఉబుసు పోకకోసం నాటకాన్నిగూర్చి, నటీ నటులను గురించి రకరకాల ప్రసంగం లారంభించారు. మొదటి తరగతి మూడవ వరస మధ్యలో కూర్చున్న లాయరు వెంకట రామయ్య నాటకాలంటే చెవికోసుకుంటాడు. తెరమీద రవంత కదులుతున్న ఆయా చిత్తరువులన్ని పరిశీలించిన తరవాత పక్కనే కుర్చీమీద చేర్లబడిన డాక్టరు పాపారావుతో ప్రసంగం ప్రారంభించాడు.

డాక్టరు ఏదో బలవంతంమీద కాలక్షేపంకోసం వచ్చిన వ్యక్తి. అతనికి నాటకాలంటే అంతగా మోజులేదు. అందుచేత అంటీ అంటనట్టు ఏవో ప్రతి సమాధానాలిచ్చాడు. మరి కొంతసేపటికి వారి సంభాషణ నటీ నటుల మీదికి తిరిగింది.

'సరోజ అంటే మన రంగనాయకి కూతురు కాదుటోయ్!'

రవంత రహస్యంగా అడిగాడు డాక్టరు పాపారావు.

'అవును! రంగమ్మ కూతురే!'

## జరిగిన కథ

పార్థసారథికి నాటకాలపిచ్చి. ఆ నాటకాల్లోపడి రాత్రి ఆలస్యంగాకూడ ఇంటికి వచ్చేవాడు. ఆ విషయమై భార్యాభర్తలమధ్య పొరపొచ్చాలు వస్తూండేవి. రాఘవ నాట్యకళా మండలిద్వారా పార్థసారథి నాటకాలు వేస్తుంటాడు. ప్రస్తుతం కృష్ణతులాభారం రిహార్సలు జరుగుతున్నవి. సరోజ అనే ఆమె కూడా అందులో ఒక పాత్రధారిణి. సరదాకు సరోజ పార్థసారథివద్ద పాట నేర్చుకోనని రాఘవ అనే మరొకతనివద్ద నేర్చుకుంటానని అన్నది. సరోజ విద్యాభివృద్ధికై తాను చేసిన ప్రయత్నాలను, సరోజ వాళ్ళ ఆర్థిక పరిస్థితులను పార్థసారథి జ్ఞాపకం చేసుకుంటాడు. సరోజ, తన చెల్లెలు పుట్టినరోజు పండుగ సందర్భంగా పార్థసారథి భార్యను ఆహ్వానించడానికి ఆయన ఇంటికి వెళ్తుంది.

'అయితే ఈ నాటకానికయ్యే ఖర్చులన్ని ఎవరు భరిస్తున్నారో!'

'కొంచెంసేపు ఊరుకుని పాపారావు మళ్ళీ అడిగాడు.

'మొత్తంమీద పెట్టుబడి అంతా పార్థసారథిదే అనుకుంటాను.'

'ఏం! రాఘవాచారి బంగారు పిచ్చుకేగా?'

'అయితేమాత్రం! చాలా జాగ్రత్తయిన మనిషి.'

'ఓహో! అలాగా! అయితే రంగమ్మ, సరోజ కలిసి పార్థసారథిని పీల్చి పిప్పిచేస్తున్నారన్న మాట! అంతేనా?'

సూటిగా అడిగాడు పాపారావు. 'అవును నిజమే! అప్పుడే మనవాడి ఆస్తి చాలావరకు హరించుకుపోయింది.'

'అలాగా! తండ్రి రెండు చేతులా బాగా సంపాదించినట్టున్నాడు! మనవాడది ఇష్టంవచ్చినట్టు తగలేస్తున్నాడు; అంతేనే! సంపాదించేవాడొకడు, హాయిమంటూ అనుభవించేవాడింకొకడు! ఇంతకి ఇతని కృష్ణవేషం ఏమయినా మాట దక్కుస్తుందా?'

ఆ ప్రశ్నమీద వెంకటరామయ్య రవంతసేపు ఊరుకుని చప్పరించేశాడు.

'భయంలేదులే' వేషంవేస్తే చూపుల గుర్రంలా ఉంటాడు! వీళ్ళిద్దరిలోను రాఘవే బాగా మెరుగు! కాని అతడు పద్యాలంత చక్కగా చదువలేడు.'

'పార్థసారథి బాగా చదువగలడా?'

తిరిగి ప్రశ్నించాడు పాపారావు

'బాగానే చదివి రక్తి కట్టించగలడని విన్నాను. కాని ఇతని కన్న సరోజ చాలా చక్కగా చదవగలదు! మహా మృదువయిన గాత్రం!

'మనిషికూడా బాగానే ఉంటుందని విన్నానే: నిజమేనా?'

పాపారావు గొంతు బాగా తగ్గించి అడిగాడు.

ఆ ప్రశ్నమీద వెంకటరామయ్య రవంత విసుక్కున్నాడు.

ఏమో: ఆ సంగతి సుందరీమణులంటే చెవికోసు కునే వాడివి నీకు తెలియాలి:

నాకేం తెలుస్తుంది? సరోజ సత్యభామ వేషాని కన్నివిధాల అమరినట్టుంటుందని విన్నానుమరి: ఇంతకి కళ్ళారా చూసేదాకా నాకు నమ్మకం లేదుసుమా: చెప్పొద్దూ:'

'ఇదేమిటి? ఎంతసేపటికి తెర కదలదేమిటి?......నాకు పోవాలని ఉంది! ఊరికే ఉత్తపుణ్యానికి నిద్ర పోగొట్టుకోవడమే గాని లాభమేమి ఉన్నట్టు కనబడదు! పోతానోయ్: నాటకం ధోరణి చూస్తే నాకేమి మాట దక్కించేటట్టు కనబడదు:'

పాపారావు మాటి మాటికి ఆవలించడం మొదలుపెట్టాడు. అంతలోనే వెంకటరామయ్య అతనిని పట్టుకున్నాడు,

'ఇంతా శ్రమపడివచ్చి ఇప్పుడే వెళ్ళిపోతానంటే ఎలాగ? కాస్త రెండో అంకమేనాకానీ: అప్పటి కంతగా బాగుండకపోతే వెళ్ళిపోదువుగానిలే:'

లేవబోయిన పాపారావు తిరిగి కుర్చీలో చతికిలబడ్డాడు. మరికొంత సేపటికి ప్రేక్షకులలో 'ఇంకా తెర లేవలేదే:' అని కొంత విసుగు బయలుదేరింది. చిట్టచివరి నేల తరగతిలో చాపల మీద చతికిలబడ్డ జనం మధ్యనుంచి సన్నని ఈలలు బయలు దేరి క్రమ క్రమంగా శృతిమించి రాగానపడ్డాయి. మరి కొన్ని నిమిషాలలో వాటితోపాటు చప్పట్లు, కేకలు కూడ విశృంఖలంగా చెలరేగాయి. క్రమక్రమంగా అవి పైతరగతులలో కూడ వ్యాపించాయి :

ఆ తరువాత తెర కొంతవరకు పైకిలేచి, ఏదో ఏర్పాటు లోపంవల్ల అక్కడే ఆగిపోయింది. వెనువెంటనే ఈలలు, చప్పట్లు కేకలు ఒక్కమారుగా హాలులో అంతట భోరుమని ప్రతిధ్వనించాయి : అంతలోనే తెరపూర్తిగా పైకిలేచింది. నారదవేష ధారిరాఘవ పాట ప్రారంభంకాగానే హాలులో కలకలం క్షణంలో మందగించింది. మరికొంత సేపటికి ప్రేక్షకులందురు పీనులొగ్గి నిశ్శబ్దంగా అతని పాట ఆలకించారు. ఆపైన అతని గొంతులో నించి మంద్రమధురంగా వెలువడిన సీసపద్యం మరింతగా సభ్యుల మన్ననలందు కొన్నది. దానితో ద్వితీయాంకంలో మొదటి రంగంముగిసినది.

రెండోరంగంలో సత్యభామా కృష్ణులు, నళిని వసంతకుడు ప్రవేశించారు. సత్యగా నటిస్తున్న సరోజ, కృష్ణ పాత్రధారి పార్థసారథి తమ వేషాలు చాలా చక్కగా సరిదిద్దుకున్నారు. విదూషకుడు వెంకటనారాయణ వికృత ముఖవికారాలతో, అకటా వికటం మాటలతో కొంతవరకు సదస్యుల నాకట్టుకున్నాడు. సత్య చెలికత్తె నళిని కూడ అతనితో సరిసమానంగానే నటించి సభ్యుల నందరిని కవ్వించినవ్వించింది. మొత్తం మీద ద్వితీయాంకం మొదటి అంకం కన్నచక్కగా రక్తికట్టింది. దానిలో పార్థసారథి, రాఘవ మంచి చాకచక్యంతో నటించి ప్రేక్షకుల ప్రశంసలందు కున్నారు.

ఇక రెండవరంగంలో కథకూడా క్రమ క్రమంగా పట్టయిన ఘట్టంలో పడింది. సత్యభామతో నళినితో, విదూషకునితో కలసి కృష్ణుడు ఉద్యానవనంలో విహరిస్తున్న సమయంలో జాంబవతీ మిత్రవిందలతోపాటు రుక్మిణి అక్కడికి వస్తుంది. సరీగా అదేతరుణంలో నారదుడుకూడా ఆ ప్రదేశం చేరుకుంటాడు. ఆనాడుతనజన్మదినంకనుక సత్యభామతో మిగిలిన పరివారంతో స్వకీయభవంతికి విజయంచేసి విందారగించవలసినదని రుక్మిణి ప్రార్థిస్తుంది.

అయితే సత్య దానికంగీకరించక కృష్ణుడు తన భవంతికే రావాలని బలవంతంచేస్తుంది. ఆనాడు రుక్మిణిదేవి పుట్టిన దినము యితే, తానుఅత్తవారింట మెట్టిన దివసమని వాదిస్తుంది. ఆ విందు భోజనానికి కావలసిన ఏర్పాటులన్నీ అంతకుమునుపే జరిగిపోయా యని నచ్చజెపుతుంది. అలాగ మరికొంత సేపు వాగ్వాదం జరిగిన తరువాత కృష్ణుడు రుక్మిణిదేవి ఆహ్వానమే మన్నించాలని నిశ్చయించుకుంటాడు, దానితో ద్వితీయాంకంలో రెండవరంగం ముగిసిపోతుంది.

అది నడుస్తున్నంతసేపు ప్రేక్షకులలో ఆసక్తి క్రమ క్రమగా ఇనుమడించింది, సత్యకోపగృహంలో అలకపానుపు మీద పవళించినపుడు, కృష్ణుని అభినయ చాకచక్యమేకాక, ఆమె ఆగ్రహనటనకూడా సభ్యులనెంతో ఆకర్షించింది. మొత్తంమీద ఆఘటంలో అంతట సరోజ, పార్థసారథి సదస్యులందరిచేత సెహబాస్ అనిపించుకున్నారు. వన్స్‌మోర్ కేకలు మాటి మాటికి హాలులో నలువైపుల ప్రతిధ్వనించాయి.

అయినా పార్థసారథి తిరిగి పద్యాలుచదివేపద్ధతి పెట్టుకోలేదు, తనదారిని తననటన కొనసాగించుకున్నాడు. సరోజ తానంటే ఎంతో అభిమానంతో ఆసక్తితో అభినయిస్తున్నదని గ్రహించు కొన్నప్పుడు క్రమ క్రమంగా అతనికి కొండంత బలంవచ్చింది, మరింతగా ఉత్సాహం కలిగింది. వారిద్దరి తరువాత ఎక్కువగా ప్రశంసలందుకున్న వాడు రాఘవ. అతనిపాటలు పాడే తీరు తెన్నులు సదస్యుల కెంతోహాయి, ఉల్లాసము కలిగించాయి. అయితే ఇకనేగిచిన గీటుదాటనని అన్న పద్యం చదువుతున్నప్పుడు మాత్రం సరోజ మిగిలిన నటీనటులందరిని తలదన్ని నదని సభ్యులందరు ముక్తకంఠాలతో మెచ్చుకున్నారు.

ఇక సామాన్యప్రేక్షకులు పార్థసారథి కనుముక్కుతీరు, అందచందాలు గమనించి, అవే అభినయాని, కాపాదించి అతనిని ఆకాశానికే ఎత్తివేశారు: కృష్ణవేషాని కన్నివిధాల అతడే తగిన వాడని వేనోళ్ల వినుతించారు. కొంచెంలోతు నెరిగిన విమర్శకులు మాత్రం అతని ఆకృతి సౌష్ఠవం మిగిలిన లోపాలన్ని కప్పి వేసినవని గ్రహించుకున్నారు. రాఘవే కొంతవరకు నటనలో అతనికన్న మిన్న అని పసికట్టివేశారు.

మిగిలిన రుక్మిణి, విదూషకుడు వసంతకుడు మొదలయిన వారందరు మొత్తంమీద బాగానే మాట దక్కించుకున్నారని

అంగీకరించారు. ద్వితీయాంకం ముగిసి తెరపడగానే ప్రేక్షకులలో ఉల్లాసా వేశంవల్ల చెలరేగిన కరతాళధ్వనులతో హాలుహాలంతా ఒక్కమారుగా ఘోరుమని ప్రతిధ్వనించింది ! డాక్టరు పాపారావు కూడ ఆనాడు నాటకం క్రమక్రమంగా రక్తికడుతున్నదని అనకుండా ఉండలేకపోయాడు. ఇక లాయరు వెంకట్రామయ్య ఆనందానికి కంతేలేదు.

మొత్తంమీద నటీనటులందరికీ తాము ఆశించిన దానికన్న ఎక్కువమన్ననే దక్కుతున్నదనిపించింది. దానితో వారందరు మరింతగా ఉప్పొంగిన ఉత్సాహంతో చిట్ట చివరి తృతీయాంకం మరి మిగిలిన అంకాలన్నిటికన్న బాగా గొప్పగా రక్తికట్టించాలని నిశ్చయించుకున్నారు. సరోజ పార్థసారథి తమనటన అందరిని తలదన్ని ఎక్కువగా ప్రేక్షకుల నాకర్షించినందు కెంతో సంతోషించారు. రాఘవమనస్సులో మాత్రం వారిద్దరియెడల పట్టరాని అసూయరేకెత్తింది. కాని అతడదిరవంతయిన పైకి పొక్కనీయ లేదు. పైపైకి చాల సంతోషించినట్టే నటించాడు. పోనీ మూడో అంకంలోనైనా వారిద్దరికన్న మిన్న అనిపించు కోవాలని నిర్ణయించుకున్నాడు. సరోజ పార్థసారథి ఒకరొకరికెంతో తోడ్పడి అంత చక్కగా నటించగలరని అతడు ఊహించి ఉండ లేదు. ఆమె ఏదోఅంటి అంటనట్టు అభినయించగలదని అనుకున్నాడు. అయితే సరోజ పార్థసారథి కోసంకాక, తన ఘనతకోసమే ప్రేక్షకులందరిమెప్పు పొందాలన్న తహ తహతోనే ఆ విధంగా అభినయించి ఉండవచ్చునని తనలోతాను సమాధాన పడ్డాడు.

తృతీయాంకంలో తెరపైకి లేవడానికి అట్టేసేపు పట్టలేదు. అయినా సదస్యులకెంతో ఆలస్యమయినట్టే స్ఫురించింది. రెండో అంకం మొదటి అంకంకన్న బాగుండడం వల్లనే ప్రేక్షకులందరు నిమ్మకి నీరెత్తినట్టు నిశ్శబ్దంగా కూర్చున్నారు. ఇక మూడవ అంకం మొట్టమొదటి రంగంలో కృష్ణుడు, విదూషకుడు, వసంతకుడు క్రమక్రమంగా నారదుడు ప్రవేశించారు. దానిలో వసంతకుని వికృత హాస్యాభినయము, కృష్ణుని వింత నటన అంతగొప్పగా ఉండకపోయినా అభినందించే ధోరణిలో ఉన్న ప్రేక్షకుల కవి చాలా గొప్పగా ఉన్నట్టే స్ఫురించాయి. ఆ పైన రెండవరంగంలో సత్యభామా కృష్ణులు, రుక్మిణి, విదూషకుడు, నళిని మొదలయిన ముఖ్యులందరు ఒక్కసారిగా ప్రవేశించారు. దానితో ఇంచుమించుగా ప్రేక్షకులందరు కరతాళధ్వనులతో వారికభినందించారు. అలాగలాగ ఆ అంకంలో ఒక్కొకరంగమే గడిచిన కొద్దినాటకం సదస్యులనెంతో ఆకర్షించింది.

ఆ అంకంలో కూడా కథకూడ అలాంటిదే ! అన్నివిధాలా అర్హుడని బ్రాహ్మణులందరు ఏకగ్రీవంగా అంగీకరించిన దేవమౌని నారదునికి సత్యభామ పారిజాతంతో బాటు ప్రాణపతిని దానం చేస్తుంది. ఆ విధంగా ఆ అభిమానవతి తానుతల పెట్టిన పుణ్యక వ్రతం తతంగం ముగిసిన తరువాత, స్వకీయధనరాసితో అతనిని తూచి ఆసొమ్మునారదునకిచ్చి పతిని తిరిగి స్వీకరించాలని సంకల్పించుకుంటుంది.

కాని తనభవనంలో మూలుగుతున్న ధనరాసులన్ని త్రాసులో గుమ్మరించినా అదిరవంతయినా కిందికిదిగదు. ఆతరువాత తననగలన్ని ఒలిచి తులలోఉంచుతుంది. అయినా అది ఆవంతయినా కదలలేదు; దానితో ఆమె గుండెలో గుబులు బయలు దేరుతుంది. నారదుని అనుమతితో తనభవంతిలో ఉన్న అమూల్యవస్తులన్ని ఆత్రాసులో గుమ్మరిస్తుంది, అయినా అది అణువంతయినా చలించదు ఆపైన తనకత్యంత ప్రియమైనశమంతకమణి కూడా ఇచ్చివేస్తానని దేవర్షితో బేరమాడుతుంది. కాని ఆకలహశీలి దానికంగీకరించడు. త్రాసులో సరిసమానంగా తూచిన అమూల్య వస్తువు లిచ్చిన తరువాతే తిరిగి శ్రీకృష్ణుని స్వీకరించాలని భీష్మించుకుని కూర్చుంటాడు;

ఆవిధంగాక్రమక్రమంగా సత్యప్రయత్నాలన్ని వ్యర్థములయినతరువాత నారదుడు శౌరిచేత చేయించదగని ప్రతి చిన్న పని పట్టుపట్టిచేయించు కుంటాడు; ఇక్కడికిరా అక్కడికిపో; కూర్చో నిలబడు.; అనిమాటి మాటికి అనేక విధాలవేధిస్తాడు ; చిట్టచివరికి వీధులలోని కీడ్చుకు పోయికనబడిన వారికందరికి అమ్మజూపుతాడు; ఆ దుస్సహా పరిస్థితి గమనించి సత్యసవతులందరు ఆమెమీద విరుచుకుపడి అనేకవిధాల నిందిస్తారు, తమతో సంప్రదించకుండా పతిని దానంచెయ్యడానికి నీకి అధికారం ఎక్కడినించి వచ్చిందని గట్టిగానిలవదీస్తారు.

చిట్టచివరికి ఏకాగ్రభక్తితోనేగాని శౌరిఎవ్వరికి స్వాధీనుడు కాడని నారదుడు సత్యకొక చక్కని సలహా ఇస్తాడు. ఇక రుక్మిణీదేవిని ప్రాధేయ పడడంకన్న వేరే గత్యంతరమేమి లేదని నిష్ఠగా చెప్పివేస్తాడు. సత్యమరిమార్గాంతరం లేక తనసవతి రుక్మిణీదేవినాశ్రయించి ఆ ఆపద తప్పించవలసినదని ప్రాధేయ పడుతుంది. ఆ సాధ్విదానికంగీకరించి ప్రగాఢ భక్తితో ప్రాణపతికి నమస్కరించి ఒకతులసీదళం త్రాసులో ఉంచగానే ఆవైపు బరువైకిందకి దిగుతుంది. కట్టకడపటి భక్తి ప్రబోధంతో శ్రీకృష్ణతులాభారనాటకం ముగిసిపోతుంది.

ఆవిధంగా ఆ అంకంలో కథపోను పోను ఎంతో ఆసక్తి, తహతహ కలిగించడం వల్లనైతే నేమి, నటీనటుల చాకచక్యం వల్లనైతేనేమి, అది అన్ని విధాలమిగిలిన అంకాలన్నింటి కన్న బాగున్నదని ప్రేక్షకులలో చాలామంది మనసారా అభినందించారు. ఆ పైన అడుగడుగునాసత్య ఆందోళన, సవతుల కయ్యాలు, దెప్పి పొడుపులు మరింతగా ప్రేక్షకుల పొగడ్తలందు కున్నాయి.

మొత్తం మీద నాటకాని కంతటికి సత్యభామా కృష్ణుల నటనాచాతుర్యమే ఎక్కువగా వన్నెకలిగించినదని కొంతలోతు లెరిగిన సదస్యులందరు ఏకగ్రీవంగా అంగీకరించారు. అయితే వారిలో కొందరు సరోజనే ఎక్కువగా మెచ్చుకున్నారు. మరి కొందరు పార్థసారథినే అభిమానించారు. ఇంకా కొందరు నటననైపుణిలో ఆ ఇద్దరు ఒండొరులకే మాత్రము తీసిపోరని తీర్పు చెప్పారు.

(సశేషం)

# శ్రీరంగం దేవాలయాలు

—ఎన్. రమేశన్

మద్రాసురాష్ట్రంలోని శ్రీరంగ క్షేత్రంలో సుప్రసిద్ధ వైష్ణవాలయంవుంది. ఏడాది పొడుగునా భక్తులు ఈ ఆలయాన్ని సందర్శించడానికి వస్తూవుంటారు. చోళరాజుల కాలంలో జాజ్వల్యమానంగా ప్రకాశించిన కావేరీ తీరస్థ భూమిలో ఉత్తరంగా యీ దేవాలయంవుంది. కావేరీకి ఉత్తరంగా కోలేరూన్ అనే మరొక నది ప్రవహిస్తున్నది. ఇది శ్రీరంగానికి పశ్చిమంగా కావేరీనదినుండి విడిపోయినశాఖ. అలా విడిపోయిన శాఖ శ్రీరంగానికి తూర్పున పదిమైళ్ళ దూరంలోతిరిగి కావేరిలో కలుస్తుంది. అందువల్ల శ్రీరంగ పట్టణం ఉత్తరాన కోలేరూన్, దక్షిణాన కావేరీనదులచేత పరివేష్టింప బడిన ద్వీపంగా అమరింది. ఇక్కడనుంచి అయిదు మైళ్ళ దూరంవరకు విస్తరించి అనేక దేవాలయాలు వున్నాయి. అర్ధమైలు దూరంలో జంబుకేశ్వర దేవాలయం అనబడే ప్రసిద్ధ శివాలయం వున్నది. శ్రీరంగానికి దక్షిణాన మూడుమైళ్ళ దూరంలో కావేరీనదిదక్షిణ తీరస్థలిని సుప్రసిద్ధమైన తిరుచునాపల్లి రాతిదేవాలయంవుంది. ఇది విఘ్నేశ్వరస్వామి దేవాలయం. ఇది కాక శివునికి మరొకరాతి దేవాలయం వుంది. దీనికి మాతృభూతేశ్వరస్వామి ఆలయం అనిపేరు. అటు ఉత్తరాన జంబుకేశ్వరాలయం, యిటు దక్షిణాన తిరుచునాపల్లి రాతి దేవాలయాలు- వీటిమధ్య యింకా అనేకమైన చిన్నచిన్న దేవాలయాలతో పరివేష్టింపబడి శ్రీరంగం ఉన్నది. ఈ దేవాలయాలూ, యీ శ్రీరంగం-యివన్నీ ఒక బృందంగా ఏర్పడి వున్నందున యివి శ్రీరంగం దేవాలయ కూటమిగా ప్రసిద్ధి కెక్కాయి.

## తిరుచునాపల్లి రాతికోట దేవాలయం:

మద్రాసుకు దక్షిణదిశగా 200 మైళ్ళ దూరంలో యీ దేవాలయం వున్నది. దక్షిణకాశీగా యిక్కడివారు దీనిని భావిస్తుంటారు. త్రిసిరుడనే రాక్షసుని పేరుమీద త్రిసిరాపురం అని యిది పూర్వం పిలవబడేదని ప్రతీతి. ఊరికిమధ్యస్థంగా ఎత్తయిన రాతిదిబ్బవుంది. ఊరిలో ఏమూలనించి చూసినస్పష్టంగా కనిపిస్తుందది. నిజానికి తిరుచినాపల్లి ఊరే రాతికోట దేవాలయ కూటానికి చుట్టూరా నిర్మించ బడింది. ఈరాతిదిబ్బ పౌరాణికంగానూ, చారిత్రకంగానూ ప్రసిద్ధికెక్కిన ప్రాంతం.

మేరు పర్వతంమీద పరమేశ్వరుడు తపస్సు చేస్తుండగా వాయువుకి, ఆది శేషుడికి పోటీ వచ్చిందట. తత్ఫలితంగా మేరు పర్వతం మూడు ముక్కలై ఒకటి కాళహస్తిలోను, మరొకటి తిరుచునాపల్లిలోను, యింకొకటి సింహాళంలోను పడ్డాయట. అందుకని దీనిని దక్షిణకైలాసంగా భావిస్తుంటారు. మరొక నమ్మకంకూడా ప్రచారంలోవుంది. రావణుని తమ్ముడు విభీషణుడు అయోధ్యనుంచి రంగవిమానంలో తిరిగి వస్తూ ఈ కావేరీ తీరంలో శుచియై పరమ శివుని పూజిద్దామని తలచి, అక్కడకు ఒక బాలుని రూపంలో వేంచేసిన వినాయకుడికి విమానాన్ని చూస్తుండమని అప్పగించాడట. వినాయకుడు ఆ స్థానానికి పవిత్రతను ఆపాదించడానికై ఆవిమానాన్ని నేలమీద వుంచాడట. దానితో అది నేలకు అంటుకు పోయిందట. విభీషణుడు పూజ పూర్తి చేసుకునివచ్చి జరిగినది తెలుసుకుని, కోపాన్ని నిగ్రహించుకొనలేక బాలుని రూపంలో వున్న వినాయకుడిని ఆ కొండశిఖరం వరకు తరముకొనివెళ్ళి అతని తలమీద గట్టిగా మోదాడట. అందుకనే యిక్కడి రాతికోట దేవాలయంలోని వినాయకుడి విగ్రహం తలమీద సొట్ట వున్నదని చెపుతుంటారు.

తూర్పు వైపునించి యీ రాతిదిబ్బ చూడ్డానికి నంది ఆకారంలో వుంటుంది. సగర్వంగా తలపైకెత్తి చూస్తున్న నంది మన దృష్టిలో మెదులుతుంది. దాని నడుముమీద వినాయకుడిగుడి. మూపుమీద శిఖరము వున్నట్టుంటాయి అందుకే ఈ రాతికి వృషభాచలమని పేరువచ్చింది. తిరుచునాపల్లి చోళ రాజులకు రాజధానినగరంకావడంవల్ల యీవట్టణం చారిత్రకంగాను ప్రసిద్ధికెక్కినది. ఉరయూరులో చోళరాజుల రాజప్రాసాదం వుండేదట. ఇప్పుడీ ప్రాంతం తిరుచునాపల్లి శివారుగ్రామం. చోళరాజుల తర్వాతవచ్చిన మధుర తెలుగు నాయకరాజులు కూడా తమ రాజధానిని మధురనించి తిరుచునాపల్లికి మార్చి యిక్కడ కొండ దగ్గర కోటకట్టుకున్నారు. మధ్యస్థంగా రాతికోట, ఉత్తరాన కావేరీనదీగల యీ తిరుచునాపల్లి సాంస్కృతిక కేంద్రంగా అనాది సిద్ధంగా ప్రసిద్ధికెక్కింది.

ఈ దేవాలయాలతో తయుమనవార్ అనే తమిళ కవి, కర్మయోగికి అతిసన్నిహితమైన సంబంధంవుంది. రెండు, మూడు శతాబ్దాలక్రితం యీయన యిక్కడవుండి, తన ఉనికిచేత యీ దేవాలయాలకు ప్రాచుర్యాన్నీ, పవిత్రతనూ సముపార్జించి పెట్టాడు. ఇక్కడి దేవాలయాలలో ప్రధాన దేవాలయమైన మాతృభూతేశ్వర స్వామి వారి ఆలయం కొండ మధ్యస్థంలో పశ్చిమ దిక్కుగా ఎదురుచేసి వున్నది. ఇతర చిన్న చిన్న దేవతల దేవాలయాలు సర్వసాధారణంగా తూర్పు దిశగా ఎదురుచేసి వున్నాయి. మాతృభూతేశ్వర దేవాలయానికి దగ్గరలో సుందరమైన నూరుస్తంభాల మంటపం ఒకటి వుంది. ఇక్కడ మతానికి సంబంధించిన చర్చలు, సమావేశాలు, ప్రసంగాలు జరుగుతుంటాయి. మణిమంటపం అనబడేమరొక మంటపం వుంది. దీనిలో సుమారు మూడు టన్నుల బరువు

గలిగి పీఠంలో నాలుగు అడుగుల వ్యాసంకల కంచుగంట వుంది. ఈ గంట రోజుకు మూడుసార్లు-ఉదయం, మధ్యాహ్నం, సాయంకాలం-మోగి, అక్కడి ప్రజలకు కొండమీది దేవుడు అండగా వున్నాడన్న విషయాన్ని, ఆయన వునికిని నిత్యం జ్ఞాపకం చేస్తూవుంటుంది.

కొండమధ్య దక్షిణంవైపు గుహాదేవాలయం ఒకటి వున్నది. దీనిని సుప్రసిద్ధ పల్లవ రాజైన మహేంద్రవర్మ (క్రీ శ. 6వ శ.) రాతిని చెక్కించి మలిపించాడు. బాదమీ ప్రభువులయిన పశ్చిమ చాళుక్యులతో భీకర సంగ్రామాలు చేసి విజయలక్ష్మిని వరించిన యీ పల్లవరాజు గుహాదేవాలయాలను మలిపించడంలో ఆద్యుడు. గుణభార, శత్రుమల్ల విచిత్ర చిత్త మొదలయిన బిరుదులు ఈయనకు వున్నాయి. ఈదేవాలయంలో మహేంద్రవర్మ పల్లవ చెక్కించిన శాసనం వుంది శత్రుమల్ల, సత్యసంధ మొదలయిన బిరుదులుగల గుణభారమహారాజు యీ గుహాదేవాలయాన్ని కొండ శిఖరంమీద నిర్మించి, ఒక శివలింగాన్ని, తన ప్రతిమను ప్రతిష్ఠించాడని అక్కడి స్తంభాలపైనగల సంస్కృతశ్లోకాల వల్ల అర్థమౌతుంది. పల్లవులకు కావేరీనది అత్యంత ప్రియతమమైన నదిగా యిక్కడి స్తంభాలపై చెక్కబడివున్నది. రాజ రాజ కేసరివర్మ ( క్రీ. శ. 985-1013 ) వంటిచోళ, పాండ్యరాజుల శిలా శాసనాలు కూడ యిక్కడ వున్నాయి. మరొక శాసనంలో వరగుణుడు అనే పాండ్యరాజును గూర్చి ప్రస్తావించ బడివున్నది. క్రీ శ. 1539 లేక 1619 కాలంనాటి వాడైన విజయనగర మహీపతి విజయ వెంకటదేవమహారాయునికి సంబంధించిన శాసనం ఒకటి వున్నదిగాని అది చాలా వరకు శిథిలమై పోయింది, క్రీ శ 1792 నాటి ముత్తువీరప్ప నాయక, క్రీ.శ 1691 నాటి రాణి మంగమ్మాళ్, విజయరంగ చొక్కనాథుడు, విజయ రఘునాథ తొండైమన్ వంటి రాజుల శాసనాలు కూడా యిక్కడ వున్నాయి.

శ్రీరంగం దేవాలయ కూటమిలో ముఖ్యమైన చిన్న దేవాలయం ఉరయూరులో వుంది. ఈ ఉరయూరు తిరుచునాపలి శివార్లలోని గ్రామం. ఒకప్పుడు యిది చోళరాజుల రాజధాని. ఇక్కడ రాజకేసరివర్మ, పరకేసరివర్మ చోళ రాజుల శాసనాలు వున్నాయి. ఈ శాసనాలపైన చోళరాజు రాజేంద్రదేవుని చరిత్ర కొద్దిగా ఉటంకించబడినది.

## జంబుకేశ్వర దేవాలయం:

శ్రీరంగ పట్టణానికి ఉత్తరంగా అర్ధమైలు దూరంలో సుందరమైన తోటలో ఈ దేవాలయం వున్నది. దీనికి తిరువన్నిక్కవల్ లేదా గజవనం అనిపేరు. ఇక్కడి దేవుడు అప్పులింగస్వామి. పంచభూతాలలోను ఒకటయిన జలానికి అధిపతి. అరుణాచలం, కాళహస్తి, చిదంబరంవంటి యితర భూతాధినాథుల దేవాలయాలు కూడా వున్నాయి. ఈ అప్పు లింగస్వామి దేవాలయ గర్భగృహంలోని దేవుని విగ్రహం యిప్పటికి నీటిలో మునిగి పోయివుంటుంది. దీని దిగువన బహుశా జలఊట వుండి వుండాలి ఈ వనంలో ఒకప్పుడు జంభు వృక్షాలు విపరీతంగా వున్నందువల్ల దీనికి జంభూకేశ్వరం అని పేరువచ్చినదని అంటారు.

దీనికి ఒక కథకూడా ప్రచారంలోవుంది. ఒకప్పుడు పార్వతీదేవికి ఒకసందేహం కలిగిందట. తన సందేహాన్ని తీర్చమని శివునికోరగా ఆయన ఆమెను యీ ప్రాంతానికి పంపి తపస్సు చేయమన్నాడట.

ఆమె యిక్కడకువచ్చి నీటితో శివలింగాన్ని తయారు చేసి ప్రతిష్ఠించి తపస్సుపూర్తిచేసిందట. ఆమెసందేహాలు తీరిపోయాయి. అప్పుడు శివుడివద్దనుండి ఉపదేశం పొందిందట. ఇక్కడే పార్వతీదేవి, శివుడువెలశారని ప్రతీతి. శివుడు పశ్చిమదిశగానూ, పార్వతీదేవి తూర్పుదిక్కుగానూ ముఖంపెట్టి వుంటారు. దీనికి ఉపదేశస్థలమని పేరు.

ఈ దేవాలయం 2400 అ.పొడవు, 1500 అ వెడల్పు వుండి అయిదు ప్రాకారాలు కలిగివుంది. శ్రీరంగం దేవాలయం సప్త ప్రాకార మధ్య స్తంగా ఉండగా, యీ దేవాలయం పంచప్రాకారంల మధ్యలో వున్నది. వెలుపలి ప్రాకారానికి విభూతి ప్రాకారమని పేరు. శివుడే యీ దేవాలయ నిర్మాణాన్ని దగ్గరుండి చేయించాడని, దీని నిర్మాణంలో పాల్గొన్న వారికి పవిత్రమైన భస్మాన్ని ప్రసాదించాడని అందుకే యీ ప్రాకారానికి విభూతి ప్రాకారమని పేరు వచ్చిందని ఒక ప్రతీతి వున్నది. ఈ ప్రాకారానికిలోపల నగిషీలు చెక్కిన వెయ్యి స్తంభాలతో అయిరక్కాల్ మంటపం అనబడే ఒక పెద్దహాలు వున్నది.

తరువాతి ప్రాకారంలో ప్రాకారంమొదలు కొని గర్భగుడి వరకు ఒక చక్కటి ద్వార మంటపం వున్నది. శ్రీరంగంలోని రంగనాథస్వామి ఏడాదికి ఒకసారి యిక్కడికి వచ్చి శివుని పూజించే వాడన్నీ. అయితే అతిరాత శైవ, వైష్ణవ మత అనుయాయుల మధ్య ఏర్పడిన విభేదాలవలన యీ అలవాటు మానుకోవడం జరిగిందని చెప్తుంటారు. ఇక్కడి అప్పులింగం అనబడే శివలింగం శివుని స్వరూపమైన జలరూపమని భావిస్తుంటారు. ఇది జంభూవృక్షంక్రింద ప్రతిష్ఠింపబడివున్నది. శాఖోపశాఖలై విస్తరించిన యీ వృక్షం అనేక వందల సంవత్సరాల నాటిదని చెప్తుంటారు. అందుకే ఈ ప్రాంతానికి జంభు కేశ్వరం అని పేరు. ఇక్కడి దేవుడు జంభుకేశ్వరస్వామి, జంభునాథుడు మొదలైన పేర్లతో పిలువబడు తుంటాడు. ఇక్కడి స్థల వృక్షం జంభు వృక్షం.

ఇక్కడి దేవత పేరు అఖిలాండేశ్వరి. ఈ దేవత గర్భాలయానికి ఎదుటవున్న మంటపంమీద పరమేశ్వరుని ఆరాధనకు సంబంధించిన శిల్పం వున్నది. ఒక స్తంభంమీద శివరూపంలో ఒకమైన ఏకపాద త్రిమూర్తిస్వరూపం అత్యంత సుందరంగా మలచబడి వున్నది. అద్వైతమత ప్రవక్తయైన ఆది శంకరులవారు అఖిలాండేశ్వరి ఉగ్ర కళను తగ్గించడానికై

కొంత ఉగ్రత్వాన్ని ఆమె ధరించిన స్వర్ణ తాటంకాలలోనికి ప్రవేశ పెట్టారని ప్రతీతి. ఈ నాటికీకూడా అఖిలాండేశ్వరిని తాటంకాలలో పూజించే అలవాటును, తాటంక ప్రతిష్ఠ ఉత్సవాన్ని జరిపే అలవాటును శ్రీకంచి కామ కోటిపీఠాధిపతులైన జగద్గురు శ్రీశంకరాచార్యులవారు పాటిస్తున్నారు. అంతేగాక అఖిలాండేశ్వరి విగ్రహానికి ఎదురుగా గణపతి విగ్రహాన్ని ప్రతిష్ఠించారు. తన కుమారుని ప్రేమతో, వాత్సల్యంతో, అభిమానంతో దర్శించడంవల్ల దేవి ఉగ్రరూపం కొంత శాంతించవచ్చు. ఇక్కడి దేవాలయంలో తొమ్మిది తీర్థాలు ఆచరణలో వున్నాయి. నిత్యము గోపూజ, అన్నాభిషేకము జరుగుతూ వుంటుంది. ఇతర దేవాలయాలలో మాదిరిగా కాకుండా యిక్కడ జంబుకేశ్వరస్వామి ఎదుట వున్న ధ్వజస్తంభం కాక ఎనిమిది ధ్వజస్తంభాలు వున్నాయి. ఇక్కడ తపస్సుచేసి పరమేశ్వరుని వద్దనుండి ఉపదేశం పొందిన పార్వతీ దేవికి చిహ్నంగా అమ్మవారి ఆలయ అర్చకుడు ప్రరోజూ స్త్రీ వేషంలో పరమేశ్వరుని అర్చిస్తుంటాడు. అక్కడికి దగ్గర్లోనే మరొక చిన్నగుడి-రాజరాజేశ్వరాలయం వుంది. ఇందులో సత్యోజాత, వామదేవ, తత్పురుష, అగోర, ఇసన అన్న పంచముఖాలుగల లింగంవుంది నాలుగు ముఖాలకు కాస్త ఎత్తుగా అయిదవ ముఖం చెక్కబడివుంది.

శిల్పకళా నైపుణ్యాన్ని, అద్వితీయ సౌందర్యాన్ని వ్యక్తంచేసే శిల్పాలు అనేకం యీ దేవాలయంలో వున్నాయి. ఒక విధంగా ఈ దేవాలయం శ్రీరంగం దేవాలయాన్ని సైతం వాస్తు శిల్పకళా విజ్ఞానంలో మించి వుంటుందనడంలో ఏమాత్రం సందేహంలేదు. ఈ దేవాలయంలో అన్నీ అత్యంత మనోహరమైన మంటపాలే. నూరు స్తంభాలమంటపం, వెయ్యి స్తంభాలమంటపం, వసంతమంటపం, సోమసంకథ మంటపం, నటరాజమంటపం, త్రిమూర్తి మంటపం-యిలా అనేకమంటపాలు వున్నాయి. వెయ్యి స్తంభాల మంటపం లోపలిభాగం చూడ్డానికి రథంలాగ వుంటుంది. చక్రాలు, గుర్రాలు, యింకా అనేకమైన ప్రతిమలు స్తంభాల మీద చెక్కబడ్డాయి, అఖిలాండేశ్వరిదేవి ఆలయం పాలరాతితో చెక్కబడింది.

ఈ దేవాలయంలో చోళరాజుల శిలా శాసనాలు అనేకం వుండడంచేత పురాతత్వపరిశోధకులకు కూడా యిది మిక్కిలి ఉపయోగపడుతుంది. తృతీయ ప్రాకారం తూర్పువైపున త్రిభువన చక్రవర్తి రాజరాజదేవుని పరిపాలనకు సంబంధించిన 20వ సంవత్సరంనాటి విషయాలు వున్నాయి. అదే ప్రాకారం మీద, 26 వ సంవత్సరం, 28 వ సంవత్సరంనాటి చరిత్ర కూడా చెక్కబడి వున్నది. దక్షిణ ప్రాకారం మీద విజయ నగర ప్రభువయిన సాళువ తిరుమలరాయుని వివరాలు వున్నాయి. ఉత్తర ప్రాకారంలో హోయసల రాజయిన వీర సోమేశ్వర దేవుని వివరాలు వున్నాయి. ఇదేరాజు పరిపాలన నాటి 27 వ సంవత్సరానికి సంబంధించిన వివరాలు కూడా వున్నాయి, (సశేషం)

